# Chandamama Press

VADAPALANI
MADRAS-26



OFFERS YOU...

FINEST PRINTING.-

Equipped with

PHOTO GRAVURE
KLIMSCH CAMERA
VARIO KLISCHOGRAPH-

-BLOCK MAKING
and a
host of Others....

# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలిచే దాని పిప్పరమెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...




...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




| | | | | | |
|---|---|---|---|---|---|
| భారతచరిత్ర - 65 | ... 2 | నేరారోపణ | ... | 33 |
| నెహ్రూ కథ | ... 5 | అనాకారిభార్య | ... | 39 |
| పాతాళదుర్గం - 10 | ... 9 | మితిమీరిన వంచన | ... | 43 |
| దేవీపూజ | ... 17 | కృష్ణావతారం | ... | 49 |
| యావజ్జీవ దీక్ష | ... 23 | అరణ్యపురాణం | ... | 57 |
| మారినరూపాలు | ... 27 | ప్రపంచపు వింతలు | ... | 61 |


ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**0-75** పైసలు

సంవత్సర చందా
రూ. **8-40**

అన్నివంటలకు శ్రేష్ఠమైన

# నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఏ.యస్. బ్రాండ్..

## చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......

## నువ్వులనూనె

- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకర మగుప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటుపదార్థ ములను అమితమగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును, ముక్కను మెత్తబడనీయవు,బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్లు:

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమీషను మర్చంటు,
శివాలయం వీధి, విజయవాడ

Ms. పెరుమాళ్ళు & కో,
137, ఆదియప్పనాయక్ స్ట్రీట్,
మదరాసు

Ms. B. V. రావు & కో,
136, పురశువాకం హైరోడ్, మదరాసు

MFRS, అంబటిసుబ్బన్న & కో. సామర్లకోట




సోల్ సెల్లింగ్ ఏజంట్లు:—

దీ బెంగాల్ ఎలక్ట్రికల్ కంపెనీ,
బెంగళూరు - 3, మదరాసు - 17

★

ఆంధ్ర:

జి. ఏ. పరశురాం కంపెనీ,
లకాడికా పూల్,
హైదరాబాదు - 1.

# అందరూ తప్పు నాదే అన్నారు

[illegible]ములో అందరూ నా ఉద్యోగము పోవడానికి తప్పు నాదే అన్నారు. కాని ఆ వ్రమానమూ ఎంతో అలసటగా ఊడురోమవి ఉంటే నేను మాత్రము ఏమి చేయగలను?






నా ఆవిడ నన్ను హార్లిక్స్ త్రాగమంది. హార్లిక్స్ నాకు పుష్టిని శక్తి! ఉత్సాహమూ తిరిగి కలిగిస్తుందని అంది



ఆమె అన్నది నిజమే! హార్లిక్స్ త్రాగిన కొన్ని వారాల్లోనే నా అలసట పోయింది. నా కొత్త ఉద్యోగములో ఉత్సాహముతో పనిచేస్తాను!




పూర్తిగా పోషణలేని కారణముగా నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. పూర్తి మీగడ గల పాలను తోడు గోధుమపిండి, మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారముతో హార్లిక్స్ రుచిగా ఉంటుంది. తప్పకుండా పనిచేస్తుంది!

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

ఇప్పుడే-
త్వరితంగా, సురక్షితంగా
తక్కువ ఖర్చుతో
మీ బాధలు నివారించుకోండి
తలనొప్పులు, జలుబు, గొంతు రాపిడి మున్నగువాటినుంచి త్వరగా ఉపశమనము

# నివారిన్




రెండు బిళ్లలుగల ప్యాకెట్ 10 పైసలు మాత్రమే
వెసులుబాటుగావుండే 50 ప్యాకెట్లుగల పెట్టెను
మీ సమీపంలోగల దుకాణందారువద్ద నేడే కొనండి.




ఉత్పత్తిదారులు
టాబ్లెట్స్ ప్రైవేట్ లిమిటెడ్
ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్, మద్రాసు-2.
సోల్ సెల్లింగ్ ఏజెంట్లు
లిటిల్స్ ఓరియంటల్ బామ్
& ఫార్మాస్యూటికల్స్ లిమిటెడ్
ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్స్, మద్రాసు-2.

EP-TI-I

YOUR HOME needs

# AMARJOTHI FABRICS



ప్రతి ఇంటా అవసరమైన పరుపు కవర్లు, దిండు కవర్లు, ఫర్నిషింగులు, టేబిల్ కవర్లు, తువాళ్ళు, నాప్కిన్లు వగైరాలు

తయారీ: **అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్,**

పో. బా. సం. 22, కరూరు (దక్షిణ ఇండియా)



## బంగారు కవరింగ్

## రాజా




BALLS BENGAL EAR RINGS









RAJA.1421. Rs. PAIR



RAJA.1422. Rs 4-00 PAIR.

SPECIAL STONE RING Rs. 10-00






DESIGN EAR RINGS
BIG SIZE Rs. 3-00
MEDIUM Rs. 2-50
SMALL Rs. 2-00 PER PAIR.

క్యాటలాగుకు. నగలకు.




2-4" SIZE Rs. 10-00 2-2 SIZE Rs. 9-00 PER PAIR.

**రాజాగోల్డుకవరింగ్‌వర్క్స్ (REGD) POST BOX No. 38. H.O. మచిలీపట్నం.**

నెల్లూరు-గవర్నరుపేట విజయవాడ 2-మెయిన్‌బజారు ఏలూరు- చిక్కడపల్లి హైదరాబాద్ 20

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు

మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పసితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యదార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్ల మరియు పనుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాంలో దంతక్షయం మరియు పనుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పనుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పనుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థముల గం టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పనుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

*FOR PRECISION IN...*



# Colour Printing

By Letterpress...

...Its B. N. K's., superb printing that makes all the difference. Its printing experience of over 30 years is at the back of this press superbly equipped with modern machineries and technicians of highest calibre.

**B.N.K.** *PRESS PRIVATE LIMITED.*

*CHANDAMAMA BUILDINGS,*

*MADRAS-26*

ఆబాల గోపాలాన్ని
ఆనందపరవశులనుచేసి పరుగులుతీస్తున్న

**వాహినీ వారి**

# రంగులరాట్నం

నిర్మాత, దర్శకుడు: **బి.యన్.రెడ్డి**

రచన: D.V.నరసరాజు
కెమెరా: రాజగోపాల్
కళ: శేఖర్ కూర్పు: మణి
సంగీతం: ఎ.రాజేశ్వరరావు, గోపాలం



తెలంగాణ: ఉషా ఫిల్మ్స్ మైసూర్: విజయపిక్చర్స్ సర్క్యూట్

ఆంధ్ర-సీడెడ్:
విజయ రిలీజ్.

# ఆరోగ్యకాపుని దినచర్య ఆయుర్వేద శాస్త్రానుసారముగా

(భిషగ్వరుల అభిప్రాయము)




దినము స్నానానంతరము- "చందనాద్యనులేపములు, దుర్గంధము, బడలిక, తాపములను పోగొట్టును. సౌభాగ్యము, తేజస్సు, చక్కని వర్ణము, మొదలగునవి యిచ్చును."

ముందు-చందన చక్కను అరుగదీసి, గంధముగా చేసి శరీరానికి రాచుకొనేవారు. యిది అసౌకర్యమని - చాలామంది వదలి వేసినారు. ఇప్పుడు-అదే చందనమును నవీన పద్ధతులలో - "విజయా కెమికల్సు" వారు - అశోకా శాండల్‌వుడ్ మూడు విధములుగా - Face - Talc - All Purpose - పౌడర్సుగా తయారు చేసినారు. వీటిని యేశ్రమా లేకుండా అందరూ ఉపయోగించ వచ్చును. వెల సామాన్యము. అన్ని ఋతువులలోను ఉపయోగింపవచ్చును. అన్ని షాపుల లోను దొరుకును.

తయారుచేయువారు :

## విజయ కెమికల్స్, మద్రాసు - 7.

బంగారము కవరింగ్ చేయబడినవి.

# శ్యామలా నగలు ధరించండి.

అందమైన డిజైనులు.

No 380.

No 785. MANGO NECKLACE

SYAMALA DOLLAR CHAIN 24" LONG NO. 680

No 832

No 823.

NO 942

NO 943

REGISTERED

## శ్యామలా గోల్డు కవరింగ్ వర్క్సు

PROP:- B. వెంకటచలం.

చిలకలపూడి (P.O.) మచిలీపట్టణం. (ఆంధ్ర)



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

స్వార్థంతోకూడిన దైవభక్తి భయానికీ, అక్రమానికీ దారితీస్తుంది, స్వార్థరహిత మైన దైవభక్తిగల మనిషికి రాజభయం కూడా ఉండదు. ఈ నీతి "దేవీపూజ" [బేతాళకథ]లో మనకు కనిపిస్తుంది.

"నేరారోపణ" అన్న కథలోకూడా శేషాద్రి అనేవాడు, రాజాజ్ఞ కన్న దేవ కార్యం ముఖ్యంగా భావించి, అందు వల్ల సత్ఫలితం పొందుతాడు.

"యావజ్జీవ దీక్ష" అన్న కథ మంచి పనులకు కూడా మితి ఉండా లన్న నీతిని బోధిస్తుంది.

సంపుటి 40 ఫిబ్రవరి '67 సంచిక 2

CHITRA



# భారత చరిత్ర




15 వ శతాబ్ది ఆఖరులో పాశ్చాత్యులు భూగోళం మీద సాధించిన అన్వేషణల మూలంగా వివిధ దేశాలమధ్య కొత్తవాణిజ్య సంబంధా లేర్పడి, అనేక దేశాల చరిత్రలో కొత్త అధ్యాయాలు ప్రారంభమయాయి. అలాటి మార్పులకు పునాది వేసిన సంఘటనలలో ప్రముఖమైనది వాస్కో-డగామా ఇండియాకు రావటం. ఇతను 1498 మే 27న కాలికట్ రేవులో అడుగుపెట్టాడు.

పైదేశాలవారు మనదేశానికి రావాలంటే రెండేమార్గాలు: ఒకటి వాయువ్యసరిహద్దు మీదుగా గల నేలమార్గం: రెండవది సముద్రమార్గం. మొగలులు నేలమార్గాన్ని బాగానే సంరక్షించారు గాని, సముద్రమార్గాలను కాపాడుకునే యత్నం చెయ్యలేదు. వారేనాడూ సముద్రం పైన ఆధిపత్యం కోరలేదు. సముద్రమార్గాలను రక్షించుకునే యత్నం చేసినవారు మహారాష్ట్రులొక్కరే.

వాస్కోడగామా పోర్చుగీసు (బుడతకీచు) నావికుడు. అతను లిస్బన్‌నగరం నుంచి బయలుదేరి ఆఫ్రికాను చుట్టి, ఇండియాకు వచ్చాడు. జామొరిన్ అనే బిరుదు గల కాలికట్ పాలకు డతనికి స్నేహం చూపాడు. అతని రాకతో పోర్చుగలుకూ ఇండియాకూ మధ్య వర్తకసంబంధా లేర్పడ్డాయి.

నిజానికి అంతకు పూర్వం కూడా పాశ్చాత్య దేశాలకూ, ఇండియాకూ మధ్య వర్తక సరుకుల రవాణా జరుగుతూనే ఉండేది. అయితే 7 వ శతాబ్ది లగాయితు ఇండియాకూ, పాశ్చాత్య దేశాలకూ మధ్య జరిగే సముద్ర రవాణాలు అరబ్బుల చేతిలో ఉండేవి; హిందూమహాసముద్రం మీదా, ఎర్రసముద్రం మీదా గల వర్తకమార్గాలు ఆ అరబ్బుల కింద ఉండేవి. ఇప్పుడా మార్గాలను పోర్చుగీసు వర్తకులు ఉపయోగించసాగారు.

## 65. పోర్చుగీసులు

1500 మార్చి 9న పేడ్రోఅల్వారెజ్ కాబ్రల్ అనే పోర్చుగీసు నౌకాధిపతి 13 వర్తకనౌకలను వెంటబెట్టుకుని లిస్బను నుంచి ఇండియాకు బయలుదేరాడు. ఇలా వర్తకానికి వచ్చిన పోర్చుగీసులు తమ వర్తక మేదో తాము చూసుకోక, తూర్పు సముద్ర ప్రాంతాలకు చెందిన వర్తకమార్గాలను తమ గుత్తసొమ్ము చేసుకునే దుర్బుద్ధితో ఇతర వర్తకనౌకలను పీడించసాగారు. అరబ్బు వర్తకుల ద్వారా లాభం పొందుతూ వచ్చిన కాలికట్ పాలకుడు ఈ కారణంగా పోర్చుగీసువారికి శత్రువయాడు. పోర్చుగీసువాళ్ళు కూడా కాలికట్ పరిపాలకుడి విరోధి అయిన కొచ్చిను పాలకుడి లాటి మరికొందరు రాజులతో స్నేహం సంపాదించి దక్షిణ భారతదేశపు రాజకీయ కుట్రలలో వేలుపెట్టారు.

భారతదేశంలో పోర్చుగీసువారి ఆధిపత్యానికి నిజమైన పునాది వేసినవాడు అల్ఫాన్సోడి అల్బుకర్క్ అనేవాడు. ఇతను మొదటిసారి ఇండియాకు 1503 లో ఒక నౌకాదళానికి నాయకుడుగా వచ్చి, అధికారుల మెప్పు సంపాదించి, 1509 లో పోర్చుగీసు గవర్నరుగా నియోగించబడి, ఇండియాలో పోర్చుగీసు వారి వ్యవహారాలు చూడసాగాడు. బిజాపూరు సల్తనతులోని దైన గోవాను ఇతను 1510 లో పట్టుకున్నాడు. ఇది సంపన్నమైన రేవుపట్టణం. అల్ఫాన్సో పరిపాలనా కాలంలో గోవానగర రక్షణలు బలపరచబడ్డాయి. దాని వాణిజ్యం కూడా పెంపొందింది. భారతదేశంలో పోర్చుగీసు సంతతి అధికం కాగలందులకు ఇతను తన దేశస్థులు భారతస్త్రీలను పెళ్ళాడ ప్రోత్సహించాడు. ఇతను ముస్లిముల పట్ల చాలా దారుణంగా ప్రవర్తించినా, తన జాతివారికి చాలా ఉపకారం చేశాడు. 1515 లో ఇతను చనిపోయే నాటికి నౌకాబలంలో పోర్చుగీసువారికి సాటిరాగలవారెవరూ



భారతదేశంలో లేరు. పశ్చిమతీర మంతా వారి అధీనంలోనే ఉండింది.

అల్బుకర్క్ అనంతరం వచ్చినవారు సముద్రతీరాన ఒక్కొక్క నగరమే స్థాపిం చుతూ వచ్చారు. దియూ, దమాన్, సల్సెట్, బసీన్, చౌల్, బొంబాయిలూ, మద్రాసు వద్ద శాంతోమ్, బెంగాలులో హుగ్లీ ఇలాటివే. పోర్చుగీసు ఆధిపత్యం సింహళంలో చాలా మేర విస్తరించింది. అయితే కాలక్రమాన ఈ ప్రదేశాలన్నీ వారి అధీనం నుంచి పోయాయి. దియూ, దమాన్, గోవాలు మాత్రమే చాలా కాలం వారికి దక్కి, చివరకు 1963 లో అవి స్వతంత్రభారతంలో చేరిపోయాయి.

భారత వాణిజ్యం పోర్చుగలుకు చాలా లాభించింది. అది చూసి అనేక పాశ్చాత్య దేశాలలో ఈస్టిండియా కంపెనీలు పుట్టు కొచ్చాయి. ఇంగ్లాండులో పుట్టిన కంపెనీ 1600 లో "తూర్పు" సముద్రాలలో వ్యాపారం సాగించే గుత్తాధికారం రాజు నుంచి పొందింది. 1602 లో డచ్చి ఈస్టిండియా కంపెనీ తూర్పు సముద్రాలలో వర్తకం సాగించడానికి మాత్రమే గాక, కొన్ని ప్రాంతాలు ఆక్రమించి, కోటలూ అవీ కట్టే పద్ధతిలో ఒడంబడికలు చేసుకోవడానికి కూడా రాజాధికారం పొందింది. 1616 లో డెన్మార్కు వారు వచ్చారు. 1664 లో ఏర్పడిన ఫ్రెంచిఈస్టిండియా కంపెనీ రాజకీయంగా పెద్దపాత్ర నిర్వహించింది. ఇలాగే ఇంకా అనేక ఈస్టిండియా కంపెనీలు పుట్టుకొచ్చాయి.

సహజంగా వీటి మధ్య పోటీలు ఏర్పడ్డాయి. 17 వ శతాబ్ది పూర్వార్ధంలో పోర్చుగీసు, డచ్చి, ఇగ్లీషుకంపెనీలు మూటి మధ్యా బహుముఖ ద్వంద్వపోరాటాలు సాగాయి. ఈ పోరాటాలలో నెగ్గలేకా, మరికొన్ని ఇతర కారణాల వల్లా పోర్చుగీసువారి ప్రతిభ 18 వ శతాబ్దిలో బాగా తరిగిపోయింది.



# నేహ్రూ కథ

## 32



మోతీలాలు, జవాహర్లు సప్రూ జయకర్లతో రెండు రోజులపాటు చర్చలు జరిపారు. మోతీలాలుకు జ్వరం తగులుతున్నది. ఈ చర్చలు ఆయనను చాలా నీరస పరిచాయి, కాని అవి ఒక ఒడ్డుకు రాలేదు. వచ్చే అవకాశం కూడా లేదు. సప్రూ జయకర్ల రాజకీయదృష్టికీ, జవాహర్ మోతీలాలుల దృష్టికీ పొంతనలేదు. వారి దొక భాషా, వీరిదొక భాషా అయింది. కాంగ్రెసుకూ, ప్రభుత్వానికీ ఆ పరిస్థితులలో సామరస్యం కుదురుతుందని జవాహరుకు గాని, మోతీలాలుకు గాని ఏమీ నమ్మకం లేదు. అంతేగాక, వారు గాంధీజీతోనూ, మిగతా వర్కింగు కమిటీ సభ్యులతోనూ సంప్రదించకుండా ఏ సూచనా చెయ్యదలచలేదు. ఈ సంగతే వారు గాంధీజీకి రాశారు.

ఆగస్టు 8 న సప్రూ వైస్రాయి నుంచి ఒక ఉత్తరం పట్టుకుని మళ్ళీ నైనీజైలుకు వచ్చాడు. దాని సారాంశమేమంటే, మోతీలాలు జవాహర్లు యెరవాడ జైలులో ఉన్న గాంధీజీని కలుసుకోవచ్చు, కాని జైలు వెలపల ఉన్న సర్దారు పటేలు, మౌలానా ఆజాద్ మొదలైన వారిని కలుసుకోవటానికి వీల్లేదు. "ఈ షరతుకు కట్టుబడి మీరు యెరవాడ జైలుకు పోతారా?" అని సప్రూ అడిగాడు.

"గాంధీజీని ఎప్పుడు చూడటానికైనా మేము సిద్ధమే. కాని మాతోటి కార్యకర్తలతో సంప్రదించ కుండా అంతిమ నిర్ణయమేదీ జరగదు," అన్నారు జవాహరూ, తండ్రీ.

అది అలా ఉండగా, అంతకు కొంచెం ముందే బొంబాయిలో దారుణమైన లాఠీ చార్జి జరిగింది; మాలవీయా, సర్దారు పటేలూ మొదలైన వర్కింగు కమిటీ సభ్యులు అరెస్టయారు. ఇందువల్ల పరిస్థితి



మరింత విషమించిందే గాని, ఏమాత్రం మెరుగు కాలేదు.

"అయినా మీరు జైలులో గాంధీజీని కలుసుకోవటం వల్ల నష్టమేమిటి?" అన్నాడు సప్రూ.

"సయ్యద్ మహ్మద్ కాంగ్రెసు కార్యదర్శి. అతను కూడా మాతోబాటు యెర్రవాడకు రావలిసి ఉంటుంది," అని జహవార్ మోతీలాలులు సప్రూతో చెప్పారు.

ఆగస్టు 10 న మోతీలాలూ, మహ్మదూ, జవాహరూ నైనీ నుంచి ప్రత్యేకమైన రైలులో పూనాకు బయలుదేరారు. ఈ రైలు పెద్ద స్టేషనులలో ఆగక మారుమూల స్టేషనులలో ఆగుతూ వచ్చింది. అయినా వీరి ప్రయాణం గురించి వార్త ముందుగా తెలిసి, జనం గుంపులు గుమికూడారు.

11 తేదీ రాత్రి పొద్దుపోయి రైలు ఖిడ్కి (పూనా దగ్గిర) స్టేషను చేరింది. తమను గాంధీజీ ఉండే జైలు ఆవరణకే తీసుకు పోతారనీ, త్వరలోనే ఆయనను కలుసుకో వచ్చుననీ జవాహర్ ప్రభృతులు అనుకున్నారు. యెర్రవాడ జైలు సూపర్నేంటు చేసిన ఏర్పాటు కూడా అదే. కాని అలా జరగలేదు. వారి వెంట నైనీ నుంచి వచ్చిన పోలీసు అధికారి ఈ ఏర్పాటును మార్చేశాడు. అలా చేయటానికి కారణం ఏమంటే, మోతీలాల్ ప్రభృతులు సప్రూ జయకర్లు లేకుండా గాంధీజీతో ఏమీ మాట్లాడరాదని; అలా జరిగితే అందరూ కూడబలుక్కొని దృఢవైఖరి అవలంబిస్తారని.

అందుచేత యెర్రవాడ జైలు అధికారులు జవాహరునూ, అతని వెంట వచ్చిన వారినీ జైలులోని మరొక ప్రాంతంలో ఆ రాత్రీ, మర్నాడు పగలూ, రాత్రీ కూడా ఉంచేశారు. మోతీలాలుకు చాలా కోపం వచ్చింది. నైనీ నుంచి గాంధీజీని కలుసుకోవటానికని వచ్చి, పూటలు జరిగినా కలుసుకోలేక పోవడం దుస్సహమే.

13 తేదీ అపరాహ్ణం వారిని జైలు ఆఫీసు గదికి వెళ్ళమన్నారు. అక్కడ సప్రూ జయకర్లు వచ్చి ఉన్నారట, గాంధీజీ కూడా అక్కడికి వచ్చాడట. మోతీలాలు తాను వెళ్ళనని మొండికెత్తాడు. జైలు అధికారులు సంజాయిషీలూ, క్షమాపణలూ చెప్పుకున్న మీదట, తాము గాంధీజీతో ముందుగా ఒంటరిగా మాట్లాడే షరతు మీద ఆయన జైలు ఆఫీసుకు పోవటానికి సమ్మతించాడు. వల్లభాయిపటేలూ, జైరాందాస్ దౌలత్‌రాం, సరోజినీనాయుడు కూడా యెర్రవాడ జైలులోనే ఉన్నారు. వీరిని కూడా జైలు అధికారులు చర్చలలో పాల్గొననిచ్చారు.

మోతీలాల్, జవాహర్, మహమ్మద్‌లను గాంధీజీ ఉండే ఆవరణలో ఉంచటమేగాక, సర్దార్ పటేల్, దౌలత్‌రాంలను కూడా తాత్కాలికంగా ఆ ఆవరణకే మార్చారు. వీరందరూ సప్రూ జయకర్లతో మూడు రోజులపాటు చర్చలు జరిపారు (ఆగస్టు 13, 14, 15 లు); తమతమ అభిప్రాయాలనూ, శాసనోల్లంఘనోద్యమం నిలిపిపెట్టి, ప్రభుత్వంతో సహకరించటానికి కనీస షరతులూ వివరిస్తూ లేఖలు రాసి ఇచ్చారు. ఈ లేఖలు పత్రికలలో కూడా పడ్డాయి.

ఈ సమావేశాల శ్రమమూలాన మోతీలాలుకు 16 తేదీన పెద్దగా జ్వరం వచ్చింది.



అందుచేత ఆయన తన అనుచరులతో సహా నైనీకి తిరిగి పోవటం 19 నాటిదాకా పడ లేదు. ఈసారి కూడా వారు ప్రత్యేకమైన రైలో చిల్లర స్టేషన్లలో మాత్రమే ఆగుతూ వెళ్ళారు. ఈసారి జనం మరింత పెద్ద గుంపులుగా వచ్చి రైలును కలుసుకున్నారు.

మోతీలాలు ఆరోగ్యం బాగా క్షీణించిపో సాగింది. ఆయనను పరీక్షించటానికి ఆయన సొంత డాక్టర్లేగాక, రాష్ట్రప్రభుత్వం పంపిన డాక్టర్లు కూడా వచ్చారు. జైలులో ఆయనకు సరి అయిన చికిత్స జరిగే అవకాశం లేదు. కాని, ఆయన మిత్రులు ఆయనను జైలు నుంచి విడుదల చేయాలని సూచన చేస్తే, ఆయనకు కోపం వచ్చింది; తానే జైలు అధి కారులను కోరి విడుదల చేయించుకున్నట్టు ప్రజలు అనుకునిపోతారని ఆయన అను మానం. తనను విడుదల చేయనవసరం లేదని ఆయన లార్డు ఇర్వినుకు తంతి కూడా పంపాడు.

కాని ఆయన పరిస్థితి నానాటికీ క్షీణదశకు వస్తున్నది. మనిషి పూర్తిగా శుష్కించి పోయాడు. సెప్టెంబరు 8 న ఆయనను విడుదల చేశారు. ఆయన జైలులో సరిగా పదివారాలపాటు ఉన్నాడు.

ఆయన విడుదల అయాక జవాహరుండే జైలు ఆవరణ నిర్జీవమైనట్టయిపోయింది. జవాహరుతో బాటు మహమ్మదూ, నర్మదా ప్రసాదూ రోజల్లా మోతీలాల్‌కు ఏవేవో సేవలు చేస్తూనే ఉండేవాళ్ళు. ఈ పను లలో నిమగ్నుడై జవాహరు నవారునేతా, చరఖాపనీ, పుస్తకపఠనమూ కూడా దాదాపు మానేశాడు. ఆయన వెళ్ళాక మిగిలిన వాళ్ళు తిరిగి తమ పాత కార్యక్రమాలు చేపట్టారు. కాని వారికా పనులలో ఇప్పు డాసక్తి లేదు. మోతీలాలు వెళ్ళిపోవటంతో దినపత్రిక రావటం మానేసింది. ఇంతలో రంజిత్ పండిట్ (జవాహరు బావ, విజయ లక్ష్మి భర్త) అరెస్టయి వాళ్ళను చేరాడు.





# పాతాళదుర్గం

## 10

[ధూమక సోమకులకు విరూపు డనే ఆటవికుడితో స్నేహం అయింది. అతడితో కలిసి వాళ్ళు ఒక నది దగ్గిర భిల్లనాయకు డొకడితో పరిచయం చేసుకుని, తెప్పల మీద నది దాటుతూండగా, మంత్రదండాన్ని ఒక పెద్ద గరుడపక్షి వచ్చి తన్ని, ఆకాశంలోకి లేచింది. విరూపుడు తన దగ్గిరున్న తాడును గరుడపక్షికి గురిచేసి విసిరాడు. —తరవాత]

విరూపుడు విసిరిన తాటిఉచ్చు గరుడపక్షి రెక్క కొకదానికి తగులుకున్నది. అదే అదనుగా విరూపుడు తాడును బలంగా కిందికి గుంజాడు. పక్షి వేగంగా పైకి పోతూండటంతో ఉచ్చు గట్టిగా బిగుసుకు పోయింది. గరుడపక్షి ఒక్క తృటికాలం గాల్లో కదలకుండా వుండిపోయి, అంతలోనే కర్ణకఠోరంగా అరుస్తూ, రెక్కల్ని బలంగా ఆడించి పై కెగరబోయింది. విరూపుడు రెండు చేతులతోనూ గట్టిగా తాడును కిందికి లాగుతూ, తెడ్లు వేసే భిల్లులను కూడా సహాయం రమ్మని కేక వేశాడు. వాళ్ళు తెడ్లు వదిలి విరూపుణ్ణి సమీపించేసరికి రెచ్చి పోయిన గరుడపక్షి అతణ్ణి తెప్ప మీది నుంచి ఒకటి రెండడుగులు గాల్లోకి లేపింది.

"విరూపా! తాడు వదలకు. నేనూ వస్తున్నాను," అంటూ సోమకుడు పెద్దగా అరిచి, తన తెప్పతో, విరూపుడి తెప్పను



సమీపించాడు. ఆ సరికి గరుడపక్షి బలం క్షీణించింది. ముగ్గురు బలశాలులు తాడును కిందికి గుంజుతూండటంతో అది, ఆకాశంలో ఒక పక్కకు ఒరిగి రెక్కలను టపటప లాడిస్తూ కింద పడసాగింది. ధూమకుడు కత్తి దూసి పక్షి మెడకు గురిచేసి బలంగా విసిరాడు. ఆ దెబ్బ గురితప్పి దాని గుండెల మీద తగిలింది. దానితో అది, మంత్ర దండాన్ని వదిలి విలవిల కొట్టుకుంటూ నదిలో వచ్చి పడింది.

సోమకుడు పరమానందం చెంది, "ధూమూ, భయంలేదు, తెప్ప తెస్తున్నాను," అంటూ ఒక కేక పెట్టి, ధూమకుడు నదిలో పడిన చోటుకు తెప్పను నడిపించాడు. ఈ లోపల విరూపుడి తెప్ప మీద వున్న గుర్రాలు రెండూ బెదిరి తెప్ప మధ్యనున్న వల్లా ఒక చివరకు పరిగెత్తటంతో, అది తల్ల కిందులైపోయి నీళ్ళలో పడినై. వాటితోపాటు విరూపుడూ, ఇద్దరు భిల్లులూ నీట పడ్డారు. ఆ ఇద్దరూ ఈత తెలిసినవాళ్ళయినా ప్రవాహ వేగానికి భయపడి, మునిగి పోతున్నామంటూ కేకలు పెట్టసాగారు. విరూపుడు నీటి వాలుకు కొట్టుకుపోతున్న తెప్పను నాలుగు బారలు వేసి అందుకుని, "భిల్లులు యింత పిరికి సన్నాసులనుకో లేదు. ఇదుగో, తెప్ప ఎక్కండి," అని అరిచి, "సోమకబాబూ! మీరు ధూమక దొర దగ్గిర కెళ్ళండి. నేను ఈదగలను. ఇంత కష్టానికీ కారణం అయిన నల్లగరుడ పక్షి ఉచ్చులోంచి బయట పడకుండా పట్టు కోవాలి. దాని గుండెకాయ కాల్చుకు తినందే నా పగ తీరదు," అంటూ దాని కేసి ఈదుకుపోయాడు.

సోమకుడు తన తెప్పతో ధూమకుణ్ణి సమీపించగానే, అతడు తెప్ప అంచు పట్టు కుని దాని మీదికి ఎక్కి కూర్చున్నాడు. నీట పడిన భిల్లు లిద్దరూ మళ్ళీ తమ తెప్ప ఎక్కి విరూపుడి కేసి దాన్ని నడిపారు.



ఈ లోపల విరూపుడు, గరుడపక్షిని చేరి, దాని మెడ పట్టుకోబోయేంతలో, అది కాళ్ళతో అతణ్ణి ఒక్క తన్ను తన్నింది. వాడి అయిన దాని గోళ్ళు శరీరానికి తగిలే సరికి, విరూపుడికి ఎక్కడలేని రౌద్రం వచ్చి, ముందూ వెనుకలు చూడకుండా దాని మీదికి ఎగిరి కలియబడ్డాడు. ఆకాశంలో తిరిగే పక్షికీ, నేల మీద నడిచే మనిషికీ నీటిలో జరుగుతున్న చావు బతుకుల పోరాటం చూసి, ధూమక సోమకులు చాలా అబ్బురపడ్డారు.

"ఏ మొసలో చూసిందంటే యిద్దర్నీ ఒక గావు పట్టుపట్టి మడుగులో వున్న తన



సొరంగంలోకి లాక్కుపోతుంది. తెప్పల్ని త్వరగా విరూపుడి కేసి నడపండి," అని ఆజ్ఞాపించాడు ధూమకుడు.

క్షణంలో తెప్పలు రెండూ విరూపుణ్ణి సమీపించాయి. ఆ సరికి అతడు ఒక చేత్తో గరుడపక్షి మెడ విరిచి పట్టుకుని, రెండవ చేత్తో దాని కాళ్ళను గుప్పెట బిగించేందుకు నానా ప్రయాసాపడుతున్నాడు. తెప్ప అతణ్ణి సమీపించగానే ధూమకుడు, "విరూపా! నువ్వు తెప్ప మీదికి రా. ఉచ్చులో దొరికిన పక్షి ఎక్కడికి పోతుంది?" అంటూ అతడి భుజాలు పట్టుకుని బలవంతంగా తెప్ప మీదికి లాగాడు. విరూపుడి శరీరంలో చాలా చోట్ల పక్షి గోళ్ళు తగిలి గాయాలయినై. ధూమకుడూ సోమకుడూ కలిసి గరుడపక్షిని తెప్ప మీదికి చేర్చారు.

"ఇది గరుడపక్షి కాదు, ఏదో రాక్షసుడు!" అన్నాడు సోమకుడు పక్షి కేసి కత్తి ఝళిపిస్తూ.

"దొరా, యింతకన్న భయంకరం అయిన పక్షులు యీ కొండల్లో వున్నవి. మేం అప్పు డప్పుడూ వీటిని ఉచ్చులు వేసి పట్టు తూంటాం. మా వాళ్ళల్లో కొందరు చిన్న పిల్లలుగా వుండగానే వీటిని పట్టుకుని పెంచుతూంటారు. అలవాటు చేస్తే





వేటలో సహాయంగా వుంటుంది," అన్నాడు విరూపుడు, గరుడపక్షి కేసి ప్రేమగా చూస్తూ.

ధూమకు డా మాటలకు పెద్దగా నవ్వి, "దాని గుండెకాయ తీసి కాల్చుకు తింటా నన్న నీ ప్రతిజ్ఞ ఏమయింది? ఒళ్ళు చూసుకున్నావా, ఎన్ని గాయాలయినయ్యో, ఎంత రక్తం కారిందో?" అన్నాడు.

విరూపుడు తన గాయాల కేసి చూసుకుని, "నది దాట నివ్వండి దొరా. ఈ గాయాలు నిమిషాల మీద నయం చేసుకుంటాను," అన్నాడు.

ఈ లోపల భిల్లులు తెడ్లు వేసి రెండు తెప్పలనూ అవతలి ఒడ్డు చేర్చారు. నదిలో పడి యీదుకు పోయిన గుర్రాలు రెండూ, నది ఒడ్డు నున్న చెట్లకింద నిలబడి సకిలిస్తున్నవి. "బతికి పోయాం. రెండూ మహారణ్యంలోకి పారిపోలేదు, నయం," అంటూ సోమకుడు వాటిని సమీపించి కళ్ళాలు పట్టుకుని, దాపుల నున్న పచ్చిక దగ్గిరికి తీసుకుపోయాడు.

విరూపుడు, గరుడపక్షిని ఉపాయంగా తెప్ప మీంచి ఒడ్డుకులాగి, తాడు కొసను ఒక చెట్టుకు కట్టి, తన గాయాలకు ఆకు పసరు పూసుకునేందుకు అక్కడ వున్న పొదల కేసి వెళ్ళాడు. ఈ లోపల ధూమ



కుడు తన తడిసిన బట్టలను పిండుకుని ఆరపెట్టుకోసాగాడు.

ఒక పావు గంట గడిచింది. హఠాత్తుగా విరూపుడు చెట్ల చాటు నుంచి, "దొరా, దొరా! ఘోరం జరిగిపోయింది," అంటూ ఒక పావుకోడు చేతబట్టుకుని ధూమకుడి దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఇది కాలశంబర మాంత్రికుడి పావుకోడు, అవునా?" అన్నాడు ధూమకుడు.

"అవును, దొరా. నాకు బాగా గుర్తు. ఆ దొర కేదో ప్రమాదం జరిగింది. కుంభీరుడనే రాక్షసు డాయన శత్రువన్నారే - వాడు ఆయన్ని చంపేసి వుంటాడని నాకు అను



మానం కలుగుతున్నది," అన్నాడు విరూపుడు భీతి చెందినవాడిలా.

"కాలశంబర మాంత్రికుడు అంత తేలిగ్గా చచ్చేరకం కాదు. రాక్షసుడైనా, కుంభీరుడు అంత దుర్మార్గుడేం కాదు. వాడి మాటల ధోరణీ, ప్రవర్తనా నేను చూశాను. కాని... మొత్తం మీద మాంత్రికుడి కేదో ప్రమాదం జరిగింది. అందులో సందేహానికి తావు లేదు," అన్నాడు ధూమకుడు.

విరూపుడు ఏమో చెప్పబోయేంతలో సోమకుడు, "ధూమూ, త్వరగా యిటురా!" అంటూ కత్తిదూసి దగ్గిరలో వున్న పొదల కేసి బయలుదేరాడు. గుర్రాల్లో ఒకటి ముక్కులు పెద్దవి చేసి, వెనక కాళ్ళ మీద నిలబడి, సోమకుడి కళ్ళెం తాడు పట్టు నుంచి పారిపోవాలని చూస్తున్నది.

ధూమకుడూ, విరూపుడూ గబగబా సోమకుడున్న చోటుకు పరిగెత్తారు. సోమకుడు పొదల కేసి చూపిస్తూ, "వాటి వెనక నుంచి మూలుగులో, మాటలో వినబడు తున్నవి. మొదట్లో నేను గుర్తించలేదు. గుర్రం భయపడి పారిపోవాలని చూస్తూంటే నాకు అనుమానం కలిగింది," అన్నాడు.

ధూమకుడు కత్తిదూసి, "జై కాళీ రమ్మా!" అంటూ పొదల్లోకి జొరబడ్డాడు. అతడి వెనకనే, "శాంభవీ!" అని కేక పెడుతూ విరూపుడు వెళ్ళాడు.

"అయ్యా, చస్తున్న వాడి మీద కత్తి కఠారు లెత్తుతారెందుకు? నేను రాక్షసుణ్ణి కాదు...అట్లని మనిషినీ కాదు. పాతికేళ్ళ, కాలకలిరాక్షసుడి చెర నాకు యీ రెండూ కాని మరేదో వికారరూపాన్నిచ్చింది," అన్న మాటలు వినిపించినై.

ఆ మాట్లాడిన వాడి ఆకారవిశేషాలు చూసి ముగ్గురూ దడుచుకున్న వాళ్ళలా ఆగి పోయి, ఒక్కొక అడుగే వెనక్కు వేయ సాగారు. మిడిగుడ్లూ, బట్టతలా, అక్కడక్కడా సూదుల్లా నిలబడి వున్న వెంట్రు



కలూ—ఆ మనిషి మాట్లాడే శవంలా వున్నాడు. అతడి శరీరం మీద బలంగా తగిలిన గాయాల గుర్తులు కనబడుతున్నవి.

"ఆ పావుకోడెవరిది? ఆ మంత్రదండం ఎవరిది? ఆ రెండూ కాలశంబర మాంత్రికుడివేనా?" అని ప్రశ్నించాడు, ఆ వికారాకారుడు ఆయాసపడుతూ.

"అవును, కాలశంబరుడివే! నువ్వెలా గుర్తించగలిగావు? నువ్వెవరివి?" అని అడిగాడు ధూమకుడు.

"ఇప్పుడో యింకా సేపటికో చావనున్న నే నెవరినైతే మాత్రం మీకేం? ఒకప్పుడు నే నీ ప్రాంతాలవాణ్ణే. కాలకలిరాక్షసుడి బంట్లకు దొరికి పాతికేళ్ళుగా వాడి చెర అనుభవించాను. వాళ్ళు నాకు ప్రాణ భయం పెట్టి, యీ ప్రాంతాలవాణ్ణి గనక— యిక్కడ మనుషుల్ని ఎత్తుకు పోవటానికి వచ్చినప్పుడల్లా, దారిమార్గం చూపేందుకు నన్ను వెంటబెట్టుకు వచ్చేవాళ్ళు. ఇప్పుడూ ఆ పని మీదే నన్ను వెంట తెచ్చారు. పారిపోవాలని ప్రయత్నించాను, ఫలితం యీ గాయాలు!" అంటూ వికారాకారుడు కళ్ళు మూసుకుని ఆయాసపడసాగాడు.

అతడు మరెంతో సేపు బతకడన్న అనుమానం కలిగిన ధూమకుడు, అతణ్ణి సమీ




పించి, "మేం ఆ కాలకలి మీద పగ తీర్చుకునేందుకు వెళుతున్నాం. అతణ్ణి హతమార్చి నీ ఆత్మకు శాంతి కలిగిస్తాం. ఈ ఒక్క మాటకు జవాబు చెప్పు; కాలశంబరుణ్ణి ఆ రాక్షసుడి బంట్లు పట్టుకుని చంపారా?" అని అడిగాడు.

"ఆ సంగతి నేను నమ్మకంగా చెప్పలేను. అతడూ, అతడి వెంట వున్న ఒక యువకుడూ, ఆ దుర్మార్గుల్ని ఎదిరించి పోరాటం సాగించారు. ఆ గందరగోళంలో నేను పారిపోయేందుకు ప్రయత్నించాను. నన్ను కత్తులతో పొడిచి యిక్కడ పారవేశారు," అన్నాడా వికారాకారుడు.

"ఆ క్రూరులు ఎటుగా పోయారో చెప్ప గలవా?" అన్నాడు ధూమకుడు.

"చెప్పలేను...కాని...వాళ్ళు ఎక్కి వచ్చిన పడవ నది కొండమలుపు తిరిగే రేవులో వున్నది...మీరు వాగ్దానం చేసినట్టు, ఆ కాలకలిని చంపి నా ఆత్మకు శాంతి కలిగించండి," అంటూ వికారాకారుడు నిలువెల్లా ఓసారి కంపించి, కట్టెలా బిగదన్నుకుపోయాడు.

ధూమకుడు తన దగ్గిరున్న వస్త్రాల్లో ఒక దాన్ని అతడి శరీరం మీద కప్పి, "విరూపా! నీ కితడు చెప్పిన నది మలుపు తెలుసునా?" అని అడిగాడు.

"తెలుసుదొరా! అది ఎంతో దూరం కూడా లేదు, బయలుదేరండి," అన్నాడు విరూపుడు.

గుర్రాలను జాగ్రత్తగా చూస్తూండమని భిల్లులకు చెప్పి ముగ్గురూ నది మలుపు కేసి బయలుదేరారు. నాలుగైదు నిమిషాలు గడిచేసరికి వాళ్ళకు కొండను చుట్టి పోతున్న నదీ, అక్కడ రేవులా వున్న ఒక ప్రదేశంలో పెద్ద పడవా కనిపించింది. వాళ్ళు చెట్ల చాటున దాక్కుంటూ ముందుకు పోయి, రేవును సమీపించగానే, దాని ఒడ్డు నున్న చెట్లు ఎక్కి పడవ కేసి పరీక్షగా చూశారు. పడవ మీద ఎవరూ లేరు. కాని, పడవ చుట్టూ ఎన్నో మొసళ్ళు యీదుతూ కనిపించినై. "సోమూ! బాణం గురిపెట్టి ఒక దాని శిరస్సు బద్దలయ్యేలా కొట్టు," అన్నాడు ధూమకుడు.

సోమకుడు బాణం గురిపెట్టి వదలబోయేంతలో, విరూపుడు, "దొరా!" అంటూ ఏదో చెప్పబోయాడు. కాని, యీ లోపలే సోమకుడు వదిలిన బాణం రివ్వుమంటూ పోయి, ఒక మొసలి తలను ఠపీమంటూ తాకింది. మొసలి నీళ్ళల్లో అంత ఎత్తున ఎగిరి పడి మనిషిలా కీచుమంటూ అరిచింది. —(ఇంకావుంది)





# దేవీ పూజ

వినుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాలుడు, "రాజా, ఈ అపరాత్రి వేళ నీవు పడేపాట్లు చూస్తూంటే, వెనకటికి హంసపాదు డనే రాజు మల్లెపూల కోసం పడిన శ్రమ జ్ఞాపకం వస్తున్నది. శ్రమ తెలియకుండా నీకా కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

కుంజరావతి అనే నగరంలో హంసపాదు డనే రాజు ఉండేవాడు. ఆయనకు భద్రపాలు డనే కుమారుడుండేవాడు. యుక్త వయసురాగానే భద్రపాలుడికి కుముదద్వీప రాజకుమార్తె నిచ్చి పెళ్ళి చేశారు.

పెళ్ళి అయాక భద్రపాలుడు మూడు మాసాల బాటు అత్తవారింట మనుగుడు

## బేతాళ కథలు



పులు కుడిచి, సముద్రం మీద భార్యతో సహా స్వదేశానికి బయలుదేరాడు. అతని నౌక ఫలాని రోజున బయలుదేరుతున్నదని హంసపాదుడికి ముందుగానే వార్త వచ్చింది.

భద్రపాలుడు వచ్చే నౌక సముద్ర మధ్యంలో ఉండగా భయంకరమైన తుఫాను చెలరేగింది. సముద్రం మీదుగా కుంజరావతీ నగరాన్ని తాకిన ప్రళయమారుతానికి నగరంలోని మహామహా వృక్షాలు పడిపోయాయి, ఇళ్ళు కూలిపోయాయి, కొన్ని ఇళ్ళకప్పులు ఎగిరిపోయాయి, సముద్రజలం కొద్ది ఘడియలపాటు నగరంలోకి కూడా ప్రవేశించింది. తీరానికి సమీపంలో ఉండే పల్లెకారుల పడవలూ, వర్తకుల పడవలూ అనేకం మునిగిపోయాయి.

ఈ తుఫాను చూసీ, వార్తలు వినీ, తన కొడుకూ, కోడలూ సముద్ర మధ్యంలో ఏమైపోయారో నని హంసపాదుడు చాలా భయపడిపోయాడు.

"తల్లీ, నా కొడుకునూ, కోడలినీ క్షేమంగా ఇల్లు చేర్పించావంటే, వాళ్ళు చేరిననాడే నీకు వెయ్యిసువర్ణాల విలువ గల మల్లెపూలతో పూజ చేస్తాను," అని రాజు తన కులదేవత అయిన మహాదేవికి మొక్కుకున్నాడు.

రెండురోజులు విజృంభించిన తుఫాను మూడోనాటికి నిలిచిపోయింది. నాలుగోనాడు రాజుకు శుభవార్త అందింది. ఆయన కొడుకూ, కోడలూ ఎక్కిన ఓడ తుఫాను వాతపడలేదు. ఓడ సరంగు చాలా సమర్థుడు. తుఫాను రాబోతున్న లక్షణాలు ముందుగానే గ్రహించి, ఓడను ఒక చిన్న లంకకు చేర్చాడు. తుఫాను నిలిచిపోగానే ఓడ తిరిగి బయలుదేరింది.

ఈ శుభవార్త అందిన కొద్ది గంటలకే భద్రపాలుడు, భార్యతో సహా ఇల్లు చేరాడు.

"దేవి నా మొర ఆలకించింది. ఇవాళే నేను ఆ తల్లికి వెయ్యి సువర్ణాల విలువ

గల మల్లెపూలతో పూజ చేస్తాను," అని రాజు, మల్లెపూలు దొరికిన చోటనల్లా పట్టుకు రమ్మని తన భటులను పంపి, తాను మహాదేవి ఆలయంలో కూర్చున్నాడు.

మధ్యాన్నమనగా మల్లెపూల కోసం బయలుదేరి వెళ్ళిన భటులు సాయంకాలానికి గాని తిరిగి రాలేదు. ఆ రావటం కూడా వట్టి చేతులతో వచ్చారు. ఎక్కడా ఒక్క పువ్వు దొరకలేదు. మల్లెపువ్వే గాదు, ఏ పువ్వూ లేదు. తుఫాను పూలతోటలన్నిటినీ ధ్వంసం చేసేసింది.

ఈ సమాచారమంతా విన్న మంత్రికి ఏం చెయ్యాలో తోచలేదు. ఆయన ఆలయంలో ఉన్న రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, మహాదేవి పూజ మరొక రోజు పెట్టుకోండి. ఇవాళ ఎక్కడా ఒక్క పువ్వయినా దొరకదు. మన మనుషులు తోటలన్నీ తిరిగి, పడిపోయిన పూలమొక్కలను స్వయంగా చూసి వచ్చారు," అన్నాడు.

"అబ్బాయి తిరిగి వచ్చిన నాడే దేవికి మల్లెపూలతో పూజ చేస్తానని మొక్కుకున్నాను. పూలు దొరికినదాకా ఇక్కడి నుంచి కదలను," అన్నాడు రాజు.

పూలమ్మేవాళ్ళు ఆ సమయానికి దేవాలయం దగ్గిరికే వస్తారు, ఆలయం గోడ




పక్కగా వరసలో కూర్చుంటారు. దారి తప్పి ఎవరైనా వస్తారేమో చూద్దామని మంత్రి ఆలయం బయటికి వచ్చాడు. గోడ వెంబడి ఎవరూ లేరు. పూలు లేనిమాట నిజమేనని మంత్రి అనుకుంటూండగా ఒక ఆడమనిషి చిన్న బుట్టతో వచ్చి దేవాలయ ద్వారం సమీపంలో కూర్చున్నది.

మంత్రి ఆశగా ఆమెను సమీపించి, "అమ్మీ, మల్లెపూలు కావాలి. ఉన్నాయా?" అని అడిగాడు.

"ఇవే ఉన్నాయి, బాబూ," అంటూ ఆ మనిషి బుట్టలో ఉన్న రెండు గుప్పిళ్ళ పూలు చూపింది.




"ఇంతేనా? ఇవి చాలవే! మాకు వెయ్యి సువర్ణాల పూలు కావాలి," అన్నాడు మంత్రి.

"వెయ్యి సువర్ణాలైనా, లక్ష సువర్ణాలైనా నా దగ్గిర అమ్మకానికి ఉన్న పువ్వులివే. ఇష్టమైతే కొనండి," అన్నదామనిషి.

మంత్రి ఆలయంలోకి వెళ్ళి, రాజుతో ఆ పూల మనిషి అన్నమాట చెప్పాడు.

రాజుతలలో ఒక భావం మెరపు లాగా మెరిసింది. "మంత్రీ, దేవి అనుగ్రహించింది. ఆ మనిషి ఇచ్చే పూలనే వెయ్యి సువర్ణా లిచ్చి కొనెయ్యి," అన్నాడు.

మంత్రి వెయ్యి సువర్ణా లిచ్చి పూలు కొని రాజు వద్దకు తిరిగి వచ్చాడు.

పూజారి వచ్చి రాజుగారి పేర మల్లె పూలతో మహాదేవిని పూజ చెయ్యబోతూ ఉండగా, పూలమ్మిన మనిషి కూడా ఆలయంలోకి వచ్చి మరి రెండు గుప్పిళ్ళ మల్లెపూలు పూజారి కిచ్చి, "ఇవి కూడా అమ్మవారికి పూజచెయ్యి," అన్నది.

ఇది చూసిన మంత్రికి పట్టరాని కోపం వచ్చింది. "దుర్మార్గురాలా, నా దగ్గిర వెయ్యిసువర్ణాలు తీసుకుని రెండుగుప్పిళ్ళ పూలిచ్చినా నేను ఒప్పుకున్నాను. కాని ఇంకో రెండు గుప్పిళ్ళు నీ దగ్గిర దాచుకుని వాటిని కూడా ఎందుకిచ్చావు కావు? నీ వంటి పాపాత్మురాలిని ఏం చేసినా పాపం లేదు," అన్నాడు.

"అమ్మకానికి నా దగ్గిర రెండు గుప్పిళ్ళే ఉన్నాయని మొదటే చెప్పాను. వాటికి వెయ్యి సువర్ణాలియ్యమని నేను తమర్ని అడిగానా? తమరే ఇచ్చారు. నా దగ్గిర మిగిలి ఉన్న రెండు గుప్పిళ్ళూ అమ్మేవి కావు. అవి దేవికి నేను పూజ చేసేవి. నా దగ్గిర రెండు తట్టల పూలున్నా ఒక తట్టే అమ్ముతాను. రెండో తట్ట దేవి పూజకే! నా దగ్గిర రెండే పూలుంటే తమరికి ఒక్కటే అమ్మి ఉండేదాన్ని. ఇందులో మోసం ఏమీ లేదు," అన్నది పూలమనిషి

ఆ మాట నిజమే. ఆమె భర్తకు పూల తోట ఉండేది. అందులో ఎన్ని పూలు కోసినా సగం మాత్రమే అమ్మి, మిగతా సగం దేవికి పూజ చేసేది. పూలన్నీ అమ్మి డబ్బులు ఇంటికి పట్టుకురాక తమ ఇల్లు గుల్ల చేస్తున్నదని ఆమెను భర్తా, అత్తగారూ ఇంటి నుంచి వెళ్ళ గొట్టేశారు. అప్పుడామె తన ముసలి తాత వద్దకు వెళ్ళి, తాతా వాళ్ళ దొడ్డి నిండా పూలమొక్కలు నాటి, వాటి పూలలో సగం అమ్మి, సగం దేవికి పూజ చేసి, తన సంపాదనతో తన పొట్ట పోషించు కుంటూ తాతను కూడా పోషిస్తున్నది.

ఆమె రోజూ పూలు తెచ్చి దేవికి పూజ చేయిస్తుందని తెలిసి కూడా పూజారి ఆమె మాటలకు ఆగ్రహించి, "ఒళ్ళు తెలియ కుండా మాట్లాడకు. వీరెవరనుకున్నావు? మహారాజుగారు! వారి దగ్గిర వెయ్యి సువర్ణాలు పుచ్చుకుని దగ్గిరున్న పూలలో సగం దాచుకుంటావా? నీ వంటి పాపిష్ఠి ముండ పూజ దేవి అంగీకరిస్తుందా?" అంటూ పూలమనిషి ఇచ్చిన మల్లెపూలను రాజుగారి పూలతో కలిపేశాడు.

వెంటనే రాజుగారి మల్లెపూలు కమిరి ఎర్రగా అయిపోయాయి. అది చూసి రాజుకు మతిపోయింది.



"పూజారీ! ఆ మనిషి పువ్వులా మనిషికే ఇచ్చెయ్యి. మహాదేవికి నేనొకటీ, ఆ మనిషి ఒకటీనా?" అన్నాడాయన.

అర్చకుడు వణుకుతున్న చేతులతో, వాడని పూలన్నీ వేరే తీశాడు. అప్పుడు వాడిన పూలన్నీ తిరిగి తెల్లగా అయాయి. పూజారికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆయన రాజుగారి తరఫునా, పూలమనిషి తరఫునా వేరువేరుగా పూజలు జరిపి ఇద్దరినీ పంపేశాడు.

ఆ తరవాత ఆ పూలమనిషి జీవితం కూడా చక్కబడింది. తన భార్య దగ్గిర వెయ్యి సువర్ణాలున్నాయని తెలియగానే

భర్త వచ్చి తీసుకుపోయాడు. మహాదేవికి ఆ మనిషి పట్ల ప్రత్యేక ఆదరమున్నదని పొక్కి పోవటం చేత ఆమె నందరూ భక్తితో చూస్తూ వచ్చారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఎవరి భక్తి గొప్పది? రాజుదా? పూలమనిషిదా? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నిస్సందేహంగా పూలమనిషి భక్తే గొప్పది. రాజు రెండు గుప్పిళ్ళ పూల కోసం వెయ్యి సువర్ణాలు ఖర్చుచేసి, తన మొక్కు చెల్లించుకున్న మాట నిజమే. ఆయన దేవికి మొక్కు చెల్లించినదాకా గుడిలోనే ఉండి పోతాననటం కూడా గొప్ప సంగతే. కాని అందులో రాజుకు గల నిజాయితీ హెచ్చుగా కనబడుతుంది. తన కొడుకూ కోడలూ క్షేమంగా తిరిగి రావాలన్న స్వార్థంతో అపూర్వమైన పూజ చేస్తానని రాజు దేవికి మొక్కుకున్నాడు. అలాటి మొక్కులు ఆయన జీవితంలో ఒకటి రెండుసార్లకన్న ఎక్కువ మొక్కుకునే అవసరం రాదు. అదీకాక రాజుకు వెయ్యి సువర్ణాలొక పెద్ద మొత్తం కాదు. కాని పూలమనిషి దారి వేరు. రాగి డబ్బు కూడా ఆమెకు పెద్ద మొత్తమే. అయినా ఆమె రోజూ దేవికి తన పూలలో సగం పూజచేసి, తన సంపాదనలో సగం ధారపోస్తున్నది. ఆమె ఏ మొక్కులూ మొక్కుకో లేదు, దేవి నుంచి ఏ మంచీ కోరలేదు. భర్త వదిలెయ్యటం కన్న ఆడదానికి పెద్ద కష్టం ఉండదు. అలాటి కష్టం వచ్చినా ఆమె దేవికి పూజ మానలేదు. అందుచేత పూలమనిషి భక్తితో రాజు భక్తిని ఏ విధంగానూ పోల్చటానికి లేదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# యావజ్జీవ దీక్ష

ఆదికాలంలో సురైభ్యుడనే మునికుమారుడు గురువు దగ్గిర అధ్యయనం పూర్తి చేసి, సౌజన్య అనే కన్యను పెళ్ళాడి, కొందరు శిష్యులను కూడా సంపాదించాడు.

ఒకసారి విద్వత్సభ జరిగింది. గొప్ప గొప్ప వేదవిదులందరూ గోష్ఠి చేశారు. "మనం నేర్చుకున్న వేద మంతా ఎంత? చాలా కొద్ది. నిజమైన వేదపారంగతు డంటే మాండవ్యమునినే చెప్పుకోవాలి!" అని పెద్దలు అనటం సురైభ్యుడి చెవిన పడింది. వెంటనే అతను మాండవ్యుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళి, ఆయనకు శిష్యుడుగా చేరి మళ్ళీ అధ్యయనం ప్రారంభించాడు.

నాలుగైదేళ్ళలో మాండవ్యుడు సురైభ్యుడికి, తనకు తెలిసిన వేద మంతా చేప్పేశాడు.

"వేద మంతా ఇంతేనా? లేక ఇంకా ఉన్నదా?" అని సురైభ్యుడు మాండవ్యుణ్ణి అడిగాడు.

దానికి మాండవ్యుడు. "బ్రహ్మ నుంచి వెలువడిన వేదంలో నాలుగు పిడికెళ్ళే భూలోకానికి అందనిచ్చాడు దేవేంద్రుడు. అందులో ఒక పిడికెడు నేను గ్రహించాను. మిగిలినవి భరద్వాజుడి వద్ద ఉన్నాయి," అన్నాడు.

ఇంకేం? సురైభ్యుడు భరద్వాజాశ్రమానికి పోయి, ఆ మునికి శుశ్రూష చేసి, ఆయనకు తెలిసిన వేదాలన్నీ నేర్చుకున్నాడు.

అప్పటికీ సురైభ్యుడికి తృప్తికలగలేదు.

"ఇంకా వేదాధ్యయనం చెయ్యాలంటే ఏమిటి ఉపాయం?" అని అతను భరద్వాజ మహామునిని అడిగాడు.

"భూలోకంలో అవతరించిన వేదమంతా అధ్యయనం చేశావు. ఇంకా వేదాధ్యయనం చెయ్యగోరితే ఇంద్రుణ్ణి మెప్పించి, అతని నుంచి పొందవలసిందే గాని మరొక మార్గం లేదు," అన్నాడు భరద్వాజుడు.

జి. కామేశ్వరరావు



సురైభ్యుడు ఒక యోగ్యమైన ప్రదేశాన్ని చూసుకుని, అక్కడ ఇంద్రుణ్ణి గురించి విధ్యుక్తంగా తపస్సు చేయసాగాడు.

అతని తపస్సు కొంతకాలం సాగాక ఇంద్రుడు మెచ్చి, ప్రత్యక్షమై, ఏమివరం కోరతావని అడిగాడు.

"వేదాల పారం ముట్టాలన్న కోరికతో నీ కోసం తపస్సు చేశాను. నీ వద్ద ఉండే వేదమంతా నాకు అనుగ్రహించు," అన్నాడు సురైభ్యుడు.

ఇంద్రుడు వేదాలను ఒక పెద్ద గుట్టలాగా అతని ముందు పడవేసి అంతర్ధానమయాడు. సురైభ్యుడు ఒక్కొక్క పత్రమే తీసి పఠించసాగాడు. అతనిలా చదువుతూండగా అతని భార్య సౌజన్య అతని కోసం వెతుకుతూ వచ్చి, అతనున్న చోటు చేరుకున్నది.

"ఎందుకు వచ్చావు? నేను నిన్ను పిలిపించలేదే?" అన్నాడు సురైభ్యుడు.

"మీ భార్యగా నా ధర్మం నిర్వహించటం నా విధి. అందుకని వచ్చాను," అన్నదామె.

"నే నీ వేదాన్ని ముగించకుండా సంసార జీవితంలో అడుగు పెట్టను," అన్నాడు సురైభ్యుడు.

నిజానికి ఆమె రాకవల్ల అతనికి అధ్యయనం మరింత బాగా సాగింది. అతనిప్పుడు ఆవును పోషించే పని లేదు. ఆశ్రమం పనులన్నీ సౌజన్యే చేస్తున్నది.

ఒకనాడు చూసే సరికి వేదాల గుట్టలో ఒక్క పత్రం కూడా మిగలలేదు. అన్నీ చదివేశా ననుకున్నాడతను. అతను కృతజ్ఞత చెప్పటానికి భరద్వాజాశ్రమానికి వెళ్ళాడు.

అతను భరద్వాజుడికి నమస్కారం చేసి, "మీ చలవ వల్ల నేను ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేసి, ఆయన అనుగ్రహంతో వేదాలన్నిటినీ పొంది, ఆసాంతం అధ్యయనం చేశాను," అన్నాడు.

"అలా అయితే నిన్ను పోలిన వేదవేత్త భూ ప్రపంచంలో లేడు. నీకు తెలిసిన వేద

మంతా నీ శిష్యులకు చెప్పి, నీ కర్తవ్యం నిర్వర్తించు," అని భరద్వాజుడు సురైభ్యుణ్ణి ఆశీర్వదించాడు.

సురైభ్యుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చేశాడు. అతను వేదపారంగతు డయాడని విని అతని పాతశిష్యులు అతన్ని వెతుక్కుంటూ వచ్చారు.

సురైభ్యుడు తన శిష్యుల చేత అధ్యయనం చేయించాలని ఇంద్రు డిచ్చిన వేదాన్ని స్మరణకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తే ఒక్క ముక్క కూడా జ్ఞాపకం రాలేదు. మాండవ్యుడి వద్దా, భరద్వాజుడి వద్దా అధ్యయనం చేసిన వేదమే జ్ఞాపకం ఉన్నది. తాను చేసిన పొరపాటు సురైభ్యుడికి తెలిసివచ్చింది. ఇంద్రు డిచ్చిన వేదాన్ని తాను చదివాడేగాని స్వరయుక్తంగా పఠించలేదు, అధ్యయనం చెయ్యలేదు.

తన పొరపాటు తెలుసుకుని సురైభ్యుడు పశ్చాత్తాపపడి, తనకు ప్రత్యక్షం కావలిసిందని వేదాలను వేడుకున్నాడు. వేదాలగుట్ట అతని ముందు తిరిగి ప్రత్యక్ష మయింది. ఈ సారి అతను వాటిని శ్రద్ధగా, పద్ధతి ప్రకారం అధ్యయనం చెయ్యసాగాడు.

ఏళ్ళకు ఏళ్ళే గడిచాయి. సురైభ్యుడి దృష్టి మందగించి, అక్షరాలు సరిగా కన



బడటం లేదు. అతను తల ఎత్తి చూశాడు. ఎదురుగా ఒక వృద్ధురాలు కూర్చుని ఉన్నది.

"ఎవరు నువు? నా భార్య సౌజన్య ఎక్కడ?" అని అతను ఆమె నడిగాడు.

"నేనే సౌజన్యను," అన్న దామె.

సురైభ్యుడు ఆశ్చర్యంతో తనను తాను పరీక్షించుకున్నాడు. తనకు కూడా వృద్ధాప్యం వచ్చేసింది. చర్మం ముడతలు పడింది. వెంట్రుకలన్నీ పండిపోయాయి. వేదాలగుట్ట పూర్తి కాకుండానే తనకు అధ్యయనం చేసే శక్తి పోయింది.

సురైభ్యుడు ఇంద్రుణ్ణి ధ్యానించాడు. ఇంద్రుడు ప్రత్యక్షమయాడు.

"దేవేంద్రా, నేను కోరిన ప్రకారం వేదాలనైతే ఇచ్చావు గాని, వాటిని అధ్యయనం చేసే శక్తి నిచ్చావు కావు. నాకు ఆయువు పూర్తి అవుతున్నది, వేదాధ్యయనం పూర్తి కాలేదు," అన్నాడు.

"నీ వేదాధ్యయన తత్పరతను మెచ్చుకున్నాను. నీకు మూడువందల ఏళ్ళు ఆయువిస్తున్నాను," అని ఇంద్రుడు అదృశ్యుడయాడు. సురైభ్యుడు తిరిగి యౌవనం పొంది వేదాధ్యయనంలో నిమగ్నుడయాడు. మధ్యలో సౌజన్య వృద్ధాప్యంతో మరణించింది. సురైభ్యుడామెకు ఉత్తర క్రియలు చేసి తిరిగి వేదాధ్యయనంలో నిమగ్నుడయాడు. కాని అతని అధ్యయనం సాగలేదు. అతని కళ్ళముందు అస్పష్టంగా ఏవో భూతాలు ప్రత్యక్షమై, "మా మాట ఏమిటి?" అని ఆక్రోశించసాగాయి.

సురైభ్యుడికి ఆ భూతాలేవో అంతుబట్టలేదు. అవి ఎందు కలా తన అధ్యయనాన్ని భంగపరుస్తున్నాయో కనుక్కుందామని భరద్వాజుడి వద్దకు వెళ్ళాడు.

భరద్వాజుడు అతను చెప్పినదంతా విని, "నీకు కనిపించిన భూతాలు నీ పాపాలు. ప్రతి మనిషికీ పితృ రుణమూ, మాతృ రుణమూ, పత్నీ రుణమూ ఉంటాయి. వాటిని తీర్చక పోవటం మహాపాపం. వేదాధ్యయనంలో మునిగిపోయి నువు నీ కర్తవ్యాన్ని మరిచావు. నీ భార్య జీవితాంతం దాకా నీకు సేవ చేసి, అసంతృప్తితో మరణించి, నీ శిష్యుడికే కుమార్తెగా పుట్టింది. నువ్వామెను పెళ్ళాడి, బిడ్డలను కని అన్ని రుణాలూ తీర్చుకో. వేదాలు అనంతమైనవి. ఇంద్రుడు అనంతమైన ఆయుర్దాయం ఇచ్చినా నువు వాటిని ముగించలేవు," అని జ్ఞానోపదేశం చేశాడు.

సురైభ్యుడు భరద్వాజుడి ఉపదేశాన్ని అనుసరించి, పెళ్ళి చేసుకుని, గృహస్థ ధర్మాలు నెరవేర్చి, తరించాడు.





# మారినరూపాలు

ఒక గ్రామంలో పట్టయ్య అనే పేదవాడుండే వాడు. పట్టయ్యకు కొండ డనే పదేళ్ళకొడు కుండేవాడు. పట్టయ్య రోజూ బస్తీకి వెళ్ళి, అక్కడ దొరికిన కూలిపనులు చేసుకుని, తన సంపాదనతో ఇంటికి కావలిసిన వెచ్చాలు తెచ్చుకునేవాడు. అతను రోజూ తన కొడుకును వెంట బెట్టుకుపోయేవాడు. కొండడు తన తండ్రి చేసే పనులలో సహాయపడేవాడు, బస్తీ వింతలన్నీ చూసే వాడు, దుకాణాల్లో ఖరీదైన వస్తువులు చూసి, "అది కొను, నాన్నా! ఇది కొను, నాన్నా!" అని వేధించేవాడు.

"అవి మహారాజు కొడుకులు కొనేవిరా! కూలివాడి కొడుకు కొనేవి కావు," అని పట్టయ్య అనేవాడు.

ఆ వస్తువులు బేరం చేసి కొనేవాళ్ళను చూసి, "వీళ్ళంతా మహారాజుల కొడుకు లేనా?" అనేవాడు కొండడు.

"కాకేమిటి? అటువంటి వస్తువులు కొనే వాళ్ళు మహారాజు కొడుకులనే అను కోవాలి," అనేవాడు తండ్రి.

"నేను మహారాజు కొడుకుగా పుడితే ఎంత బాగుండేది? ఎందుకలా పుట్టలేదు, నాన్నా?" అని కొండడు అడిగేవాడు.

"వాళ్ళకు దేవుడలా వర మిచ్చాడు. నీ కివ్వలేదు," అనేవాడు తండ్రి.

ఈ మాట కొండడి తలలో బాగా నాటింది. భగవంతుణ్ణి ధ్యానించి, తాను కూడా వరం పొంది, మహారాజు కొడుకుగా పుట్టాలని కొండడికి గొప్ప కుతూహలం కలిగింది. వాళ్ళ గ్రామంలో గ్రామదేవత గుడి ఒకటి ఉన్నది. దాని వెనక అడవి ఉన్నది.

కొండడు రోజూ ఆ గుడికి వెళ్ళి, దేవ తకు దణ్ణంపెట్టి, "నన్ను కూడా రాజ కుమారుణ్ణిగా చెయ్యి, దేవీ!" అని వేడు కుంటూ వచ్చాడు.

సి. అశోక్‌కుమార్




ఒకనాటి మధ్యాన్నం కొండడు ఇలాగే ప్రార్థించే సరికి, గ్రామదేవత, "నీకు రాజకుమారుడు కావాలని ఉంటే, ఈ గుడి వెనక ఉన్న అడవిలోకి వెళ్ళు, అక్కడ నీకు ఒక రాజకుమారుడు కనిపిస్తాడు. అతన్ని తాకి అడవిలోకి పారిపో. ఆ తరవాత నువు రాజకుమారుడి వవుతావు," అని పలికింది.

కొండడు మహా ఉత్సాహంగా, ఆలయం వెనక ఉన్న అడవిలోకి పరిగెత్తాడు. ఆ సమయంలో ఆ దేశపు రాజు ఎక్కడికో ప్రయాణం చేస్తూ, అడవి సమీపంలోనే గుడారాలు దించి ఉన్నాడు. రాజుకొడుకు, కొండడి వయసువాడే, ఒక జింకపిల్లను చూసి, దాన్ని పట్టుకుందామనే ఆశతో అడవిలోకి పరిగెత్తుకుంటూ వచ్చి, కొండడికెదురయాడు. ఆ వచ్చేవాడు రాజుకొడుకని గ్రహించి, కొండడు వాణ్ణి చేత్తో తాకి, అడవిలోకి పారిపోయాడు.

కొండడు రాజకుమారుణ్ణి తాకిన క్షణంలోనే ఒకరి రూపం ఒకరికి వచ్చేసింది. కొండడు రాజకుమారుడిలాగా అయిపోయాడు, రాజకుమారుడు కొండడిలాగా అయాడు. తనకు పేదకుర్రాడి రూపం ఎలా వచ్చిందో రాజకుమారుడికి అర్థం కాలేదు. తనను ఇలా చేసిన కుర్రాడి కోసం వెతుకుతూ వాడు ఆలయం దగ్గిరికి వచ్చేసరికి, పట్టయ్య తన కొడుకును వెతుక్కుంటూ అక్కడికే వచ్చి, "ఓరి, ఇక్కడేం చేస్తున్నావు?" అని అడిగాడు.

రాజకుమారు డది వినిపించుకోక, పట్టయ్యను చూడగానే, "ఒరే, నన్ను మా నాన్నగారి గుడారం చేరుస్తావా? నీకు బహుమానం ఇప్పిస్తాను," అన్నాడు.

పట్టయ్య నిర్ఘాంతపోయి, "ఏమిట్రా నీ పేలుడూ?" అన్నాడు.

కొండడి రూపంలో ఉన్న రాజకుమారుడు దర్పంగా, "జాగ్రత్తగా మాట్లాడు!

నే నెవరనుకున్నావు? రాజుగారబ్బా యిని!" అన్నాడు.

పట్టయ్య ఆ కుర్రవాడి నోరు నొక్కి, "ఊరుకోరా, నాయనా, ఎవరన్నా విన్నా రంటే పీక తెగిపోతుంది. అస్తమానమూ రాజుకొడుకు కావాలని కలవరించి, కలవరించి చివరకు పైత్యం తల కెక్కినట్టు న్నది," అంటూ రాజుకొడుకు నెత్తుకుని ఇంటిదారి పట్టాడు.

రాజుకొడుకు గిజగిజా తన్నుకుంటూ, "నన్ను దించు! ఎవరు నువు? నన్నెక్క డికి తీసుకుపోతున్నావు? ఎవడో కుర్రకుంక నన్ను తాకి ఇలా మార్చేశాడు. వాడు కని పిస్తే చంపేస్తాను!" అంటూ పెద్దగా కేకలు పెట్టసాగాడు.

అయినా పట్టయ్య వాణ్ణి ఎలాగో పట్టి తీసుకుపోయి, మంత్రాలు పెట్టించాడు, పిచ్చికి వైద్యం చేసేవాళ్ళకూ, భూతవైద్యు లకూ చూపాడు. కాని అందువల్ల కొంచెం కూడా ప్రయోజనం లేకపోయింది. రాజ కుమారుడు అంతకంతకూ చాలా దురు సుగా తయారయాడు. పట్టయ్య వాణ్ణి గుంజకు గట్టిగా కట్టి ఉంచవలసి వచ్చింది. తన కొడుకు కేదో పెద్దగాలి సోకిందని పట్టయ్యకు తోచింది. ఎందుకంటే రాజ




కుమారుడు పట్టయ్య పూరికొంపను చూసి చీదరించుకున్నాడు; తిండి పెట్టబోతే, "ఛీ, ఛీ!" అని ముట్టలేదు.

ఈలోపల అడవిలో రాజకుమారుణ్ణి తాకి అతని రూపం తెచ్చుకున్న కొండడు పరిగెత్తిపోతూ రాజభటులకు దొరికాడు. వాళ్ళు రాజకుమారుడి కోసం వెతు క్కుంటూ వస్తున్నారు. వాళ్ళు కొండణ్ణి చూసి, "తమ రిక్కడున్నారా, అబ్బాయి గారూ? వెతికివెతికి చచ్చినంత పని చేశాం," అని వాణ్ణి ఎత్తుకుని రాజభవ నానికి తీసుకుపోయారు. కొండడు అభ్యం తరం చెప్పలేదు. అప్పటికి రాజుగారి పరి



వార మంతా కూడా వేట నుంచి తిరిగి రాజభవనం చేరారు.

రాజభవనంలో ప్రతిదీ కొండడికి అద్భుతంగానే ఉన్నది. వాడు ప్రతి స్వల్ప విషయాన్నీ వింతగా చూడటం గమనించి రాజభటులు, "ఏమిటలా వింతగా చూస్తున్నారు? రోజూ చూసేదేగా?" అన్నారు.

కొండడు భటుల మాటలు వినిపించుకోకుండా రాజభవన మంతా కలయతిరిగాడు. పాకశాల వద్దకు వెళ్ళి, అక్కడ సేవకుల కోసం తయారయే వంటకాలు నోట వేసుకుని, "ఎంత బాగుంది! అద్భుతం!" అనసాగాడు.

"మీకీ పనివాళ్ళ వంటకాలు తినే కర్మేమిటి, మహారాజా! తమరి వంట వేరే జరుగుతున్నది," అని అక్కడివాళ్ళు చెప్పారు. కాని కొండడు వినిపించుకునే స్థితిలో లేడు.

చూడటానికి రాజకుమారుడేగాని, అతని ప్రవర్తన ఏ మాత్రమూ రాజకుమారుడిదిగా లేదు. ఈ సంగతి రాజభవనంలోని నౌకర్లందరూ గుర్తించి, రాజుగారితో చెప్పారు. రాజుగారు కొండణ్ణి తన దగ్గిరికి రప్పించి, చూస్తూనే తన కొడుకు నేదో క్షుద్రగ్రహం ఆవేశించిందని తెలుసుకుని, నిర్బంధంలో పెట్టించి వైద్యులనూ, మంత్రవేత్తలనూ పిలిపించాడు.

రెండు మూడు రోజులపాటు గ్రహపూజలూ, మంత్రోచ్చాటనలూ, వైద్యమూ జరిగినా రాజకుమారుడిలో మంచి మార్పేమీ లేదు. పైపెచ్చు, వాడు రాజభవనం నుంచి పారిపోవటానికి కూడా ఒకటి రెండుసార్లు ప్రయత్నించాడు.

తన కొడుకును ఎప్పటి మనిషిని చేసిన వాడికి పదివేల రూకలిస్తానని రాజు దండోరా వేయించాడు.

ఈ చాటింపు వార్త పట్టయ్య ఉండే గ్రామానికి కూడా చేరింది. అందరూ

వింతగా చెప్పుకున్నారు. కొండడి రూపంలో పట్టయ్య ఇంట ఉంటున్న రాజకుమారుడు పరిస్థితి అర్థం చేసుకున్నాడు. తనను తాకినవాడు ఈ పట్టయ్య కొడుకు. కాని వాడేమైపోయినదీ ఇంతదాకా రాజకుమారుడికి తెలియరాలేదు. వాడు తన స్థానంలో రాజభవనం చేరాడని దండోరా మూలంగా ఇప్పుడు తెలిసింది. తమ రూపాలు ఎందుకిలా మారాయో, వాడికి తెలిసి ఉండాలి. వాడితో ఒకసారి మాట్లాడితే తనకు కూడా తెలుస్తుంది.

అందుకని రాజకుమారుడు తన ప్రవర్తన పూర్తిగా మార్చేసుకుని తానే కొండడైనట్టు నటించసాగాడు. పట్టయ్యకు పరమానందమయింది. ఆయన వాడి కట్లు విప్పి, ఇంటో తిరగనిచ్చాడు. రాజుకొడుకు పట్టయ్యతో, "రాజుగా రబ్బాయికి కూడా మనసు చెడిందిటగా?" అన్నాడు.

"అవును. చాటింపు విన్నావా ఏం? వాణ్ణి బాగుచేస్తే పదివేలిస్తారుట కూడా!" అన్నాడు పట్టయ్య.

"వాడికి నేను చికిత్స చెయ్యగలనే! మనం అక్కడికి పోదామా?" అన్నాడు రాజుకొడుకు.

"నువు నిజంగా నయంచేస్తే మన దరిద్రం తీరేపోతుంది," అన్నాడు పట్టయ్య.



ఇద్దరూ కలిసి రాజభవనానికి వెళ్ళారు. రాజకుమారుడు తమని పలకరించే పద్ధతి చూస్తే రాజభటులకు ఆశ్చర్యం వేసింది. ఆ కుర్రాడు చూడటానికి ఎవరోలాగున్నాడు గాని రాజభవనంలో అన్ని ప్రాంతాలూ తెలిసిన వాడిలాగా, అందరినీ ఎరిగినవాడిలాగా కనబడింది. అందుచేత వాళ్ళు అడ్డుపుల్లలు వెయ్యకుండా పట్టయ్యనూ, రాజకుమారుణ్ణీ రాజుగారి ఎదటపెట్టారు.

"నన్ను ఒక్కసారి ఆ కుర్రాడితో మాట్లాడనిస్తే మీవాణ్ణి మీకు చూపిస్తాను," అన్నాడు రాజకుమారుడు రాజుతో.

రాజు కామాటలో ఎందుకో నమ్మకం కలిగింది. రాజు వాణ్ణి ఒంటరిగా కొండడున్న చోటికి పంపాడు.

ఇద్దరూ మాట్లాడుకున్నారు. కొండడు రాజకుమారుడికి జరిగినదంతా చెప్పి, "నే నిక్కడ ఉండను. నా కిక్కడ కొంచెం కూడా బాగా లేదు," అన్నాడు.

"మీ ఇంట నాకూ బాగా లేదు. నన్ను మళ్ళీ తాకు, మన రూపాలు మళ్ళీ మారతాయేమో చూద్దాం," అన్నాడు రాజకుమారుడు.

కొండడు రాజుకొడుకును తాకాడు. ఇద్దరికీ యథారూపాలు వచ్చేశాయి. ఇద్దరూ చెయ్యీ, చెయ్యీ పట్టుకుని రాజుగారి ఎదటికి వచ్చేశారు. కొండడు, "నాన్నా!" అని పెద్ద కేకపెట్టి ఏడుస్తూ తన తండ్రిని కౌగలించుకుని, "నే నిక్కడుండను, నాన్నా! ఇంటికి వెళ్ళి పోదాం పద!" అని తండ్రిని తొందర చేశాడు.

వాడి మతి మళ్ళీ చెడిపోయిందనుకున్నాడు పట్టయ్య.

కాని రాజుకొడుకు జరిగినదంతా చెప్పాక అందరి అయోమయమూ తొలగిపోయింది. తన కొడుకు తనకు దొరికినందుకు రాజు సంతోషించి, పట్టయ్యకూ, కొండడికీ అనేక బహుమానా లిచ్చి, పంపేశాడు.





# నేరారోపణ

చంద్రపుర మనే రాజ్యాన్ని సోమశేఖరుడనే రాజు పాలించేవాడు. అతను వయసుకు చిన్నవాడైనా సూక్ష్మబుద్ధి గలవాడు. అతనికి తన పురోహితుడంటే చాలా గురి; ఏ పని చెయ్యవలసి వచ్చినా రాజపురోహితుడి సలహా లేకుండా చేసేవాడు కాడు. అందువల్ల అతనికి చాలా లాభించేది.

సోమశేఖరుడి వివాహం ఒక్కటే పురోహితుడి సలహా లేకుండా జరిగింది. దానికి కారణమేమంటే, ఆ వివాహానికి కొంతకాలం ముందు నుంచీ పురోహితుడు జబ్బుపడి మంచంపట్టాడు.

ఆ జబ్బు నుంచి ఆయన కోలుకోలేదు. పురోహితుడు అవసానదశలో ఉన్నట్టు తెలిసి రాజు ఆయనను చూడబోయాడు.

"నా అనంతరం నా కొడుకును శేషాద్రిని రాజపురోహితుడుగా వేసుకుని పోషించండి. వాడు ఏ విషయంలోనూ నాకు తీసి పోడు," అని పురోహితుడు రాజును వేడుకున్నాడు. తరవాత ఆయన తన కొడుకు శేషాద్రిని పిలిచి, వాడి చెవిలో రహస్యంగా ఏదో ఉపదేశం చేసి ప్రాణాలు వదిలాడు.

రాజు శేషాద్రిని రాజపురోహితుడుగా వేసుకున్నాడు. రాజు ఏది చెయ్యదలిచినా శేషాద్రి ఎప్పుడు చెయ్యవలసినదీ, ఎలా చెయ్యవలసినదీ చెబుతుండేవాడు. రాజు అతని సలహా ప్రకారమే చేస్తూ ఉండేవాడు. శేషాద్రి చెప్పిన ప్రకారం చేసే పనులన్నీ సానుకూల మవుతూ ఉండేవి. అందుచేత రాజుకు శేషాద్రి పైన త్వరలోనే అమితమైన ఆదరాభిమానాలు ఏర్పడ్డాయి.

ఒకరోజు రాజు శేషాద్రితో, "వేటకు పోదా మనుకుంటున్నాను. త్వరలోనే మంచి సమయం చూడు," అన్నాడు.

"రేపు సూర్యోదయానికి నాలుగుఘడియలు ముందుగా బయలుదేరితే వేట

ఏ. అప్పారావు



సుఖంగా జరుగుతుంది. అరుణోదయం వేళ తూర్పుగాలి కొంచెం తీవ్రంగా కొట్టుతుంది. కాని అట్టేసేపుండదు," అన్నాడు శేషాద్రి.

"అయితే నువు కూడా నాతో రావటానికి సిద్ధంగా ఉండు. సాయంకాలాని కల్లా తిరిగి వస్తాం," అన్నాడు రాజు.

శేషాద్రి చెప్పిన వేళకే అందరూ కలిసి బయలుదేరి, తూర్పు తెల్లవారే సమయానికి నగరం వెలపలికి చేరుకున్నారు. సరిగా అదే సమయానికి తూర్పు నుంచి ఈదురు గాలి తీవ్రంగా సాగింది.

"అబ్బ, ఎంత చలిగా ఉన్నది! గాలి గట్టిగా వీస్తుందని నువు ముందే చెప్పావు. నాకే జ్ఞాపకం లేక పోయింది. కాస్త మా ఇంటికి వెళ్ళి, నా పడక గదిలో ఉన్న శాలువ తెచ్చి పెడతావా?" అని రాజు శేషాద్రి నడిగాడు.

శేషాద్రి తన గుర్రం మీద వేగంగా రాజ భవనం చేరుకున్నాడు. అతను తిన్నగా రాజుగారి పడక గదికి వెళ్ళి, లోపల అడుగు పెట్టబోతూండగా, చనిపోతూ తన తండ్రి పెట్టిన ఆంక్షలలో ఒకటి జ్ఞాపకం వచ్చింది. "దంపతుల శయన మందిరాన్ని ప్రవేశించకు," అని అతని తండ్రి చెప్పాడు.

అందుచేత అతను తలుపు దగ్గిరే నిలబడి, "రాజుగారు శాలువా తెమ్మన్నారు," అని గట్టిగా అన్నాడు.

"తలుపు గడియవేసి లేదు, లోపలికిరా!" అని లోపలి నుంచి రాణీ అన్నది.

"ఎందుకులెండి? శాలువను మీరే అందించండి," అన్నాడు శేషాద్రి.

రాణి తలుపురెక్క ఒకటి తెరిచి అతనికి శాలువ అందించింది. అదే సమయంలో ఒక మగవాడి చెయ్యి శేషాద్రి చేతిని పట్టుకుని గదిలోకి లాగయత్నించింది.

శేషాద్రి ఆ చేతి పట్టు విడిపించుకుని, శాలువ తీసుకుని, అతి వేగంగా బయటికి వచ్చి, తిరిగి రాజును కలుసుకున్నాడు.

ఆ రోజు వేట బాగానే సాగింది. సాయం కాలం కాగానే రాజు తన భవనానికి తిరిగి వచ్చాడు. శేషాద్రి సెలవు తీసుకుని తన ఇంటికి వెళ్ళిపోయాడు.

రాజు తన అంతఃపురంలోకి ప్రవేశిస్తూనే అక్కడి వాతావరణం మామూలుగా లేక పోవటం గమనించాడు. దాసీ లందరూ దిగులుగా ఉన్నట్టు కనిపించారు. రాణి జుట్టు విరబోసుకుని, చినిగిన బట్టలతో, ఏడుస్తూ కనిపించింది.

ఏం జరిగిందని రాజు అడిగితే, శేషాద్రి శాలువ కోసమని వచ్చి తనను బలాత్కరించబోయాడని రాణి చెప్పింది.

శేషాద్రి అటువంటి పని చేస్తాడని రాజుకు ఏ కోశానా నమ్మకం లేదు. కాని రాణి అతని పైన ఇలాటి నేరం కల్పన చెయ్యటానికి కూడా కారణం ఏమీ లేదు. విచారణ వల్ల అపఖ్యాతి తప్ప మరేమీ ఉపయోగం ఉండదు. ఇటువంటి తప్పు ఎవరూ ఒప్పుకోరు. శేషాద్రి నిర్దోషి అయినా కూడా అతన్ని నిర్మూలించటం తప్ప మరొక పరిష్కారమార్గం లేదు. అతన్ని చంపటం కూడా రహస్యంగా జరగాలి.

రాజు ఈ విధంగా నిశ్చయించుకుని, మర్నాడు ఉదయం దక్షిణద్వార భటుణ్ణి పిలిచి, " ఒరే, నీ దగ్గిరికి ఒక మనిషి వచ్చి,





రాజుగారు చెప్పిన పని చేశావా అని అడుగుతాడు. అలా అడిగిన మనిషి ఎవరైనా సరే, తక్షణమే అతని తల కత్తితో నరికెయ్యి," అని హెచ్చరించి పంపాడు.

తరవాత కొంత సేపటికి శేషాద్రి మామూలు ప్రకారం రాజుగారి వద్దకు వచ్చి స్వస్తివాచనం చేశాడు.

రాజు శేషాద్రితో, "దక్షిణద్వార భటుడికి ఒక పని చెప్పాను. నువు వాడి దగ్గిరికి వెళ్ళి, రాజుగారు చెప్పిన పని పూర్తిచేశావా అని అడుగు," అన్నాడు.

శేషాద్రి సరేనని, దక్షిణద్వారం కేసి వెళుతూండగా అతని స్నేహితుడైన ఒక బ్రాహ్మణుడు కనిపించి, "శేషాద్రీ, నీ కోసమే వస్తున్నాను. మా ఇంటి కొకసారి వచ్చి సత్యనారాయణ పూజ చేయించి వెళ్ళు," అన్నాడు.

తన తండ్రి చేసిన హెచ్చరికలలో మరొకటి జ్ఞాపకం వచ్చి శేషాద్రి ఆ బ్రాహ్మణ మిత్రుడి వెంట వెళ్ళి, పూజ చేయించి, ప్రసాదం తీసుకుని, ఆ తరవాత దక్షిణ ద్వారం కేసి బయలుదేరాడు.

ఈ లోపల రాజుగారి ప్రధానమంత్రి విశ్వజితు అనేవాడు రాజుగారి దగ్గిరికి వచ్చి, "నిన్న మీ పురోహితుడు చాలా అక్రమంగా ప్రవర్తించాడు—" అన్నాడు.

"అవునవును. నాకు తెలిసింది. అన్నట్టు, దక్షిణ ద్వారపాలకుడికి ఒక పని చెప్పాను. దాన్ని వాడీపాటికి పూర్తి చేసి ఉండాలి. ఆ విషయం కాస్త విచారించి వస్తావా?" అన్నాడు రాజు.

విశ్వజిత్తు గబగబా దక్షిణద్వారం వద్దకు వెళ్ళి, అక్కడి భటుడితో, "ఒరే, రాజుగారు నీకేదో పని చెప్పారట. ఆ పని పూర్తి అయిందా?" అని అడిగాడు.

వెంటనే భటుడు కత్తితో విశ్వజితుడి తల నరికి, దాన్ని ఒక గుడ్డలో చుట్టి తెచ్చి రాజుగారి దగ్గర పెట్టాడు.

"నీ పని అయిపోయింది. ద్వారంమూసి ఇవాళకు నువు వెళ్ళిపో," అన్నాడు రాజు.

గుడ్డలో చుట్టి ఉన్నది శేషాద్రి తలే నని రాజు అనుకున్నాడు. కాని మరి కొంచెం సేపటికల్లా శేషాద్రి తిరిగి వచ్చి, "మహా ప్రభూ, దక్షిణద్వారం మూసి ఉన్నది. అక్కడ ఎవరూ లేరే!" అన్నాడు.

రాజు అతన్ని చూసి నిర్ఘాంతపోయి, "నిన్ను దక్షిణద్వారం వద్దకు వెళ్ళమని చెప్పి ఎంతసేపయింది? ఇప్పుడు వెళ్ళి వస్తున్నావా? ఇంతసేపు ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"ఒక స్నేహితు డింట సత్యనారాయణ పూజ చేయించవలసి వచ్చింది. అందుచేత అలస్యమయింది," అన్నాడు శేషాద్రి.

"నా ఆజ్ఞ కన్న ఆ పూజ నీకు ముఖ్య మయిందా?" అన్నాడు రాజు.

"అవును. నా తండ్రి ప్రాణం విడుస్తూ నాకు కొన్ని బోధలు చేశాడు. నేను వాటిని అతిక్రమించకుండా నడుచుకుంటున్నాను," అన్నాడు శేషాద్రి.

"ఏమిటా బోధలు?" అని రాజు అడిగాడు.

"'దంపతుల పడకటింట ప్రవేశించకు; అంతఃపుర రహస్యాలు వెల్లడించకు; రాజ కార్యం కన్న దేవకార్యం ప్రధానంగా



భావించు,' అని నా తండ్రి నాకు బోధించి ప్రాణాలు వదిలాడు. రాజకార్యం కన్న దేవ కార్యం ముఖ్యమని, నా స్నేహితు డింట దేవపూజ పూర్తి చేసి మీ పని మీద వెళ్ళాను," అన్నాడు శేషాద్రి.

"నిన్న ఉదయం శాలువ ఎలా తెచ్చావో చెప్పలేదే? దంపతుల పడకగది ప్రవేశించవు గద?" అన్నాడు రాజు.

"అందులో అంతఃపుర రహస్యం ఉన్నది గనక తమతో ఆ విషయం చెప్ప లేదు," అన్నాడు శేషాద్రి.

"నేనే అడుగుతున్నాను గనక చెప్ప వచ్చు, చెప్పు," అన్నాడు రాజు.

రాణి తనను గదిలోకి రమ్మనటమూ, తాను ఆమెనే శాలువ ఇవ్వమనటమూ, తాను శాలువ తీసుకునే సమయంలో ఎవడో మగవాడి చెయ్యి తనను లోపలికి లాగ యత్నించటమూ, తాను తప్పించుకు రావటమూ మొదలైన వివరా లన్నిటినీ శేషాద్రి రాజుకు చెప్పాడు.

రాజు అంతా విని, "నువు కాలజ్ఞానం కలవాడివిగద. ఈ రహస్యం వెనక ఉన్న కుట్ర ఏమిటో నాకు వివరంగా చెప్పు," అన్నాడు రాజు.

"మహారాజా, నేను శాలువ తెచ్చే దారిలోనే అదంతా అంచనా వేశాను. మీ సన్నిహితు డొకడు మిమ్మల్ని హత మార్చటానికి పన్నాగం పన్నాడు. మీకు భార్యను నిశ్చయించినది కూడా అతనే. వివాహ మయాక ఆ ఇద్దరూ మిమ్మల్ని హత్య చేసే మార్గాలు ఆలోచిస్తున్నారు. కాని వారికి పక్కలో బల్లెం లాగా నేను దాపరించాను. అందుచేత ముందు నన్ను హత మార్చటానికి ఎత్తు వేశారు. ఈ ఎత్తు పారదని తెలిసి నేను నిశ్చింతగానే ఉన్నాను. మీకు కూడా ఈ పూట నుంచీ శత్రుభయం తీరి పోయిందనే నా విశ్వాసం. అందుకే మీకేమీ హెచ్చరిక చెయ్యలేదు," అన్నాడు శేషాద్రి.

శేషాద్రి ఆ మాట అన్నాక రాజు గుడ్డ మూట విప్పి, విశ్వజితుడి తల చూసి, "వీడే నా సన్నిహిత శత్రువై ఉండాలి. మీ తండ్రి మంచంలో పడి ఉండగా ఈ దుర్మార్గుడే నా వివాహ బాధ్యత అంతా తన పైన వేసుకున్నాడు," అన్నాడు.

రాజు తన మంత్రి తలను తీసుకుపోయి తన భార్యకు చూపించాడు. ఆమె కెవ్వన అరిచి మూర్ఛపోయింది. ఆమె దుర్మార్గం రుజువయింది. రాజు ఆమెను చెరలో పెట్టించి, శేషాద్రి నిర్ణయించిన మరొక కన్యను పెళ్ళాడి, అతడిచ్చే సలహాల ప్రకారం నడుస్తూ సుఖంగా ఉన్నాడు.





# అనాకారి భార్య

ఒక గ్రామంలో ఈశ్వరదాసు అనే యువకుడుండేవాడు. వాడికి తెలివితేటలు మందంగా ఉన్నట్టు కనబడటంచేత వాణ్ణి చదువు కోసం గురుకులానికి పంపారు. ఈశ్వరదాసు గురుకులంలో చాలాకాలం గడిపి, విద్యాభ్యాసం పూర్తిచేసి గ్రామానికి తిరిగి వచ్చి, అడుగడుగునా తత్వజ్ఞానం ప్రదర్శించసాగాడు. "అబ్బో, మనవాడు గొప్ప జ్ఞాని అయాడు," అని ఊళ్ళో వాళ్ళంతా మెచ్చుకున్నారు.

విద్య పూర్తి అయింది గనక, ఈశ్వరదాసు తగిన కన్యను పెళ్ళాడి, ఒక యింటి వాడు కాదగిన సమయం వచ్చింది. అతనికి తమ కుమార్తెలను కన్యాదానం చెయ్యటానికి కొందరు సిద్ధపడ్డారు. ఆ గ్రామంలో పెళ్ళికావలసిన పిల్లలలో శుభాంగి అనే ఒక పిల్ల ఉన్నది. పిల్ల చాలా బుద్ధిమంతురాలు, ఇంటిపనులన్నీ చక్కగా చేస్తుంది— కాని అష్టావక్ర. పాపం, ఆమెకు కాళ్ళూ, చేతులూ, మెడా, నడుమూ, వీపూ, అన్నీ వంకరే. అటువంటి శుభాంగిని ఎవరు పెళ్ళాడతారు? దానికి పెళ్ళికాదని అందరూ భయపడుతూ ఉండగా, ఈశ్వరదాసు, "నేను పెళ్ళాడతాను," అన్నాడు. దగ్గిరవాళ్ళు వద్దని ఎంత హెచ్చరించినా వినలేదు; "భార్యా రూపవతీ శత్రుః! నేను శుభాంగినే పెళ్ళాడతాను," అన్నాడు.

"ఆహా! ఎంత ధర్మాత్ముడు!" అన్నారు ఊళ్ళోవాళ్ళు.

ఈశ్వరదాసుకు పెళ్ళి అయిన కొద్ది కాలానికి అతని తండ్రి పోయాడు. సంసార భారం ఈశ్వరదాసు మీద పడింది. అందుచేత అతను ధనాశకు పోకుండా, తంబురా తీసుకుని తత్వాలు పాడుతూ ఊరంతా తిరిగి బిచ్చమెత్తి, ఏ రోజుకు కావలిసినది ఆ రోజుకు తెస్తూ ఉండేవాడు.

ఆర్. కూర్మాచార్యులు



ఒకరోజు తనను గురించి ఊళ్ళోవాళ్ళు అనుకునే మాటలు అతని చెవులపడ్డాయి : "పాపం, దాసు చాలా యోగ్యుడు. ఏరి కోరి అష్టావక్రను చేసుకున్నాడు. కిందటి జన్మలో కన్యాదానం చేసి ఉండడు."

ఈ మాటలలో దాసుకు నిజం ఉన్న దనిపించింది. కన్యాదానం చేసుకున్నవారికి చక్కని భార్యలూ, అన్నదానం చేసుకున్న వారికి కడుపునిండా తిండీ దొరుకుతుందని అతను చదువుకున్నాడు. అయినవాళ్ళు వద్దని చెబుతున్నా వినక అష్టావక్రను పెళ్ళాడాడు. బుద్ధిః కర్మానుసారిణీ అనుకున్నాడు ఈశ్వరదాసు.

అయితే అన్ని వక్రాలూ సరిచేసే ఈశ్వరుడున్నాడు. ఈశ్వరుణ్ణి గురించి తపస్సు చేస్తే, ఆయన మెచ్చి తన భార్యను దివ్యసుందరిగా చెయ్యగలుగుతాడు. ఈశ్వరుడు ఎక్కడున్నాడు? తన హృదయంలోనే ఉన్నాడు. "శివోహం" అనే దివ్యమంత్రాన్ని తన గురువుగారు ఎంతగానో వివరించి చెప్పారు. "శివోహం" అంటే అర్థం "నేనే శివుణ్ణి" లేక "నాలోనే శివుడున్నాడు," అని.

తనలో ఉన్న శివుణ్ణి అర్చించి శుభాంగిని సుందరాంగి చేసుకోవటానికి ఈశ్వరదాసు నిశ్చయించుకున్నాడు. అతను తన భార్యతో, "రేపు నేను ఒక పని మీద పోవాలి. నాకు తట్టెడు బొబ్బట్లూ, చెంబెడు నెయ్యీ సిద్ధం చెయ్యి," అన్నాడు. శుభాంగి అలాగే చేసింది.

ఈశ్వరదాసు ఒక నిర్జన స్థలానికి పోయి కూర్చుని, తనలో ఉన్న శివుణ్ణి తలచుకుంటూ, ఒక్కొక్క బొబ్బట్టునూ నేతిలో ముంచి, "శివోహం!" అంటూ నోట వేసుకోసాగాడు. త్వరలోనే అతనికి పొట్ట ఉబ్బుకు రాసాగింది.

శివపార్వతులు ఈశ్వరదాసు పడే శ్రమ గమనిస్తూనే ఉన్నారు. పార్వతికి జాలి పుట్టుకొచ్చింది. ఆమె ప్రేరేపించగా శివుడు అనుగ్రహించి పార్వతీసమేతంగా ఈశ్వర

దాసు ఎదట ప్రత్యక్షమై, ఏం వరం కావాలో కోరుకో మన్నాడు.

ఈశ్వరదాసు పార్వతీదేవి యొక్క అద్భుత సౌందర్యం చూసి వెంటనే తల దించేసుకున్నాడు. తన భార్యను అంద గత్తెగా చెయ్యమని అడగటానికి కూడా అత నికి నోరు పెగల లేదు. అతని దుస్థితి చూసి అర్థం చేసుకుని, శివుడు అతని చేతికి మూడు రాళ్ళిచ్చి, "వీటితో నీకు మూడు కోరికలు సిద్ధిస్తాయి. ఒక్కొక్క కోరికా కోరుకుని ఒక్కొక్క రాయి విసిరివెయ్యి," అని పార్వతితో సహా అంతర్థానమయాడు.

శివపార్వతులు ఎదట ఉన్నంత సేపూ ఊపిరి కూడా సరిగా పీల్చలేక పోయిన ఈశ్వరదాసు, తృప్తిగా పెద్ద నిట్టూర్పు విడిచి, శివుడిచ్చిన రాళ్ళు తీసుకుని ఇంటికి వెళ్ళి, "నా భార్య జగదేకసుందరి కావాలి," అంటూ ఒక రాయి విసిరివేశాడు. వెంటనే అష్టావక్ర కాస్తా జగన్మోహినిలాగా మారిపోయింది.

శుభాంగి తన శరీరంలో కలిగిన మార్పు చూసి ఆశ్చర్యపోతుంటే, ఈశ్వరదాసు ఆమెతో తాను చేసిన తపస్సు గురించీ, శివపార్వతులు ప్రత్యక్షమై రాళ్ళివ్వటం గురించీ చెప్పాడు.




"బాగుంది. ఇంకా రెండు రాళ్ళున్నాయి. వాటితో ఏం కోరుకుంటారు? మీరు మహా రాజు కావాలని ఒక కోరిక కోరండి," అన్నది శుభాంగి.

"వద్దు, వద్దు. రాజునయితే యుద్ధాలు చెయ్యాలి. అహింసా పరమోధర్మః! అయినా నాకు కావలిసిన ఒక కోరికా సిద్ధించింది. మిగతా వాటి సంగతి అవసరాన్నిబట్టి చూసు కుందాం," అంటూ ఈశ్వరదాసు మిగతా రెండు రాళ్ళనూ, గూట్లో దాచాడు.

మర్నాడు ఈశ్వరదాసు తంబురా తీసు కుని భిక్షకు బయలుదేరగానే, శుభాంగి బిందె చంకన పెట్టుకుని, తన అందం

ఊళ్ళోవాళ్ళు చూడగలందులకు నీలాటి రేవుకు బయలుదేరింది.

అందరూ ఆమె అందం చూసి అద్భుతం చెందారు. కొందరు ఎరిగినవాళ్ళు కూడా, "ఎవరమ్మా నువ్వు?" అని అడిగి, ఆమె శుభాంగినని చెబితే నమ్మలేక పోయారు.

దారిలో ఆగి, పలకరించిన వాళ్ళందరి తోనూ చాలాసేపు మాట్లాడుతూ, శుభాంగి చాలాసేపటికి నీలాటి రేవు చేరింది.

అంకిందటి రాత్రే రాజనర్తకి ఒకతె రాజ భవనం నుంచి పారిపోయింది. ఆమె కోసం రాజభటులు ఉదయం నుంచీ గాలిస్తున్నారు. వాళ్ళలో కొందరు నీలాటిరేవు ప్రాంతాల వెతకటానికి వచ్చి, శుభాంగిని చూసి, ఆమే రాజనర్తకి అయి ఉంటుందనుకుని, ఆమెను పట్టుకుని తీసుకుపోసాగారు. ఆమె ఎంత ఆక్రోశించినా వాళ్ళు వినిపించుకోలేదు.

భిక్షం ఎత్తుతున్న ఈశ్వరదాసుకు తన భార్యను రాజభటులు పట్టుకుపోతున్నా రన్న వార్త త్వరలోనే తెలిసింది. అతను వెంటనే ఇంటికి పరిగెత్తి, గూట్లో ఉన్న రాళ్ళలో ఒకటి తీసుకుని, "నా భార్య ఎలుగుబంటిగా మారి, రాజభటులను భయ పెట్టి, తప్పించుకుని ఇల్లు చేరాలి," అని కోరుకుంటూ ఆ రాయిని పారేశాడు.

మరి కాస్సేపటికల్లా శుభాంగి ఎలుగు బంటి రూపంలో ఇంటికి తిరిగి వచ్చింది.

ఆ ఎలుగుబంటిని చూస్తే ఈశ్వర దాసుకే కంపరం ఎత్తింది. తాను కోరు కున్న రెండో కోరిక జ్ఞాపకం వచ్చాక గాని, ఆ ఎలుగుబంటి తన భార్యేనని అతనికి తట్టలేదు.

అతను వెంటనే గూట్లో ఉన్న మూడో రాయి తీసి, "నా భార్య ఎప్పటిలాగా అయిపోవాలి," అనుకుంటూ దాన్ని అవ తల పారేశాడు.

శుభాంగి మళ్ళా అష్టావక్ర అయి అతని ఎదట నిలబడింది.






# మితిమీరినవంచన

ఒకనాడు సుబ్బయ్య అనేవాడు పాపన్న ఇంటికి తన భార్యనూ, అయిదుగురు పిల్లలనూ వెంటబెట్టుకుని వచ్చి, "అయ్యా, పాపన్నగారూ, మాకు మీరు తప్ప ఇంకెవరూ సహాయం చేసేవాళ్ళు లేరు. నేను ఈ గ్రామంలో పుట్టి పెరిగినవాణ్ణే. పట్టణానికి పోయి, పన్నెండేళ్ళుగా అక్కడే వ్యాపారం చేసి, నష్టపడి, అంతా పోగొట్టుకుని అప్పులపాలై, మళ్ళీ గ్రామానికి తిరిగి వచ్చేశాను. మీరు కాస్త సహాయపడినట్టయితే ఇక ఇక్కడే ఉండిపోతాను," అని ప్రాధేయపడ్డాడు.

"నా నుంచి ఏం సహాయం కావాలో చెప్పు. సాధ్యమైతే తప్పక చేస్తాను," అన్నాడు పాపన్న.

ఒకప్పుడు సుబ్బయ్యకు ఆ గ్రామంలో ఒక ఇల్లూ, కొంత పొలమూ ఉండేది. అతని ఇల్లు ఊరి బయట విసిరివేసినట్టుగా ఉండేది. అదీగాక చాలా పాత ఇల్లు. పన్నెండేళ్ళ క్రితం సుబ్బయ్య పట్టణానికి పోతూ తన పొలంతోబాటు ఆ ఇల్లు కూడా అమ్మాలని చూశాడు. కాని దాన్ని ఎవరూ కొనలేదు. ఇప్పుడా ఇల్లు పూర్తిగా కూలిపోయి, నేలమట్టమయింది. ఇంటి స్థలం దిబ్బ వేసిపోయింది. దాని నిండా జిల్లేడు మొక్కలూ, నాగుజెముళ్ళూ, ఇతర మొక్కలూ మొలిచాయి.

పొలం అమ్మిన డబ్బుతో సుబ్బయ్య పట్నం చేరి, కత్తీవ్యాపారాలూ, దగావ్యాపారాలూ సాగించి డబ్బు గడించాడు. అతను బొత్తిగా సోమరి కావటం చేత బస్తీజీవితం బాగా నచ్చింది. బస్తీ సుఖాలు బాగా మరిగాడు. పనికిమాలిన స్నేహితాలు చేసి, జిహ్వాచాపల్యం పెంచుకుని, పేకాటలు మరిగి, అన్యాయంగా సంపాదించిన డబ్బును ఎడాపెడా తగలెయ్యసాగాడు.

పరోపకారి పాపన్న కథ




వేడుకలకూ, వినోదాలకూ దుర్వ్యయం చెయ్యటంలో అతని భార్య అతని కేమీ తీసిపోయేది కాదు. చివరకు ఉన్నదంతా పోగొట్టుకుని, అప్పులపాలై, వ్యాపారం దివాలా ఎత్తి, సుబ్బయ్య తన గ్రామానికి సకుటుంబంగా తిరిగి వచ్చాడు.

పూర్వం తన ఇల్లుండిన స్థలం ఎవరికన్నా రెండువందల రూపాయలకు అమ్మి, ఆ డబ్బుతో ఊరి మధ్య ఒక చిన్న పూరికొంప వేసుకుని, వీలయితే రెండు ఆవులను కొనుక్కుని, పాలవ్యాపారం చేస్తూ కాలక్షేపం చెయ్యాలని సుబ్బయ్య ఉద్దేశం. కాని, ఊరి బయట దిబ్బవేసిన ఆ స్థలాన్ని రెండువందలు పోసి ఎవరు కొంటారు? కొని ఏం చేసుకుంటారు?

ఎవరో సుబ్బయ్యతో, "నీకు సహాయం చెయ్యగలవాడు ఈ ఊళ్ళో పాపన్న ఒక్కడే ఉన్నాడు. మిగిలినవాళ్ళు ఆ స్థలాన్ని ఊరికే ఇచ్చినా తీసుకోరు. అందుచేత పాపన్న దగ్గిరికి వెళ్ళి, నీ స్థలాన్ని రెండువందలకు కొనుక్కుని సహాయపడమని వేడుకుంటే పని జరగవచ్చు," అని చెప్పి సలహా ఇచ్చారు. అందుకనే సుబ్బయ్య సకుటుంబంగా వచ్చి పాపన్న దర్శనం చేసుకుని, తన కష్టం చెప్పుకున్నాడు.

అయిదుగురు బిడ్డలతో నిరాధారంగా నిలబడి ఉన్న సుబ్బయ్యను చూస్తే పాపన్నకు జాలి పుట్టింది. అతని దగ్గిర సమయానికి రెండువందలు లేవు. అయినా మీనాక్షి నగలు తాకట్టు పెట్టి రెండువందలు భర్తీ చేసి, క్రయపత్రం రాయించి, సుబ్బయ్య స్థలం కొన్నాడు. సుబ్బయ్య ఇల్లు ఏర్పాటు చేసుకునేటందుకు రెండు మూడు రోజులు పట్టింది. అంతదాకా పాపన్నే సుబ్బయ్య కుటుంబాన్ని పోషించాడు కూడా.

ఇల్లు ఏర్పాటు చేసుకోగా సుబ్బయ్య చేతిలో కొంత డబ్బు మిగిలింది. దానితో

అవును కొనుక్కునే ప్రయత్నం చెయ్య టానికి మారుగా, సుఖం మరిగిన ప్రాణులు కావటం చేత, సుబ్బయ్యా, అతని భార్యా సుఖంగా పిండివంటలు చేసుకుతిని, పది హేను రోజుల లోపలే ఉన్నదంతా ఖర్చు చేసేశారు. సంసారం గడిచే సమస్య అలాగే ఉండిపోయింది.

సుబ్బయ్య మళ్ళీ పాపన్న వద్దకు వచ్చి, "ఒక వందరూపాయలు బదులిచ్చారంటే, రెండావులను కొని పాలవ్యాపారం చేసు కుంటాను," అన్నాడు.

"నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. నీ దగ్గిర కొన్న స్థలం బాగుచేసి చిలగడదుంప నాటుదా మనుకుంటున్నాను. కూలిపని నువే చేసి కూలి డబ్బులు పుచ్చుకో. పంట వచ్చాక గాని నా దగ్గిరికి డబ్బురాదు. అంతదాకా ఈ కూలి డబ్బులతో నీకు కాలక్షేపం అవు తుంది," అన్నాడు పాపన్న.

"ఇంతకాలం పట్నవాసం చేసినవాణ్ణి, పొలంపని నా వల్ల అవుతుందా? పార పట్టు కోవటం కూడా నాకు చాతకాదు. సరే, మీ పంట రానివ్వండి. అంతదాకా ఎలాగో గడుపుకుంటాం," అన్నాడు సుబ్బయ్య.

అతను ఆ గ్రామంలోనే ఒక వర్తకుడి కొట్టులో లెక్కలు రాయటానికి కుదిరి,




మోసం చెయ్యటంలో ఆరితేరినవాడు గనక, ఇంటికి అంతో ఇంతో రహస్యంగా చేర్చు కుంటూ వచ్చాడు.

పాపన్న తాను కొన్న స్థలాన్ని తానే స్వయంగా బాగు చేసుకోవటానికి పూనుకుని, కొడవలీ, పలుగూ, పారా తీసుకుని బయలు దేరాడు. ఆ దిబ్బ మీద పెరిగిన పిచ్చి మొక్కలన్నిటినీ కొట్టేసి, పలుగుతో తవ్వ నారంభించాడు. అలా తవ్వుతుండగా ఒక చోట చక్కని నాగశిల దొరికింది. దాన్ని ఎక్కడైనా మంచిచోట ప్రతిష్ఠ చేయింతా మని అతను పైకి తీసి ఒకచోట పెట్టే టప్పుడు, ఆ శిల కిందనే గుంటలో ఒక



చిన్న కుండ దొరికింది. ఆ కుండకు మూత బిగించి ఉన్నది. కుండను ఆడిస్తే, లోపల డబ్బు ఉన్నట్టుగా గలగలా శబ్దమయింది.

"సుబ్బయ్య అదృష్టం! సమయానికి డబ్బు దొరికింది," అనుకుంటూ పాపన్న ఆ కుండను అలాగే తీసుకుపోయి సుబ్బయ్య కిచ్చి, "ఇదుగో, సుబ్బయ్యా, మీ పూర్వీకు లెవరో మీ స్థలంలో పాతి పెట్టుకున్న డబ్బు. ఎంత ఉన్నదో ఎంచి చూసుకుని, ఆవులను కొనుక్కో," అన్నాడు.

పాపన్న సద్బుద్ధికి సుబ్బయ్య ఆశ్చర్య పోయి, పాపన్న ఎదటే కుండ మూత తీసి చూశాడు. అందులో నూరు వెండి రూపాయి నాణాలున్నాయి. సుబ్బయ్య పాపన్నకు తన కృతజ్ఞత చెప్పుకుని, అతన్ని పంపేశాడు.

ఆ డబ్బుతో సుబ్బయ్య రెండు మంచి జాతి ఆవులను కొని, పాలవ్యాపారం సాగించాడు. బస్తీలో పాలకు మంచి గిరాకీ గనక, సుబ్బయ్య పెద్ద కొడుకు బస్తీకిపోయి, పాలు అమ్మి, డబ్బు తెస్తూ ఉండేవాడు. కొంత పాలూ, పెరుగూ గ్రామంలోనే అమ్ముడయేవి. సుబ్బయ్య కర్తీ వ్యాపారంలో ఘటికుడు గనక పాలవ్యాపారం బాగా లాభసాటిగానే సాగింది. ఆవులకు మేత ఖర్చు కూడా లేదు, అవి అడవిలో మేసి వచ్చేవి.

పాపన్న తనకు దొరికిన నాగశిలను, ఒక రావిచెట్టు కింద అరుగు కట్టించి, దానిపైన ప్రతిష్ఠ చేయించేశాడు. గ్రామస్థులు దాన్ని పూజిస్తూ, దానికి మొక్కులు చెల్లిస్తూ, దాని చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ, అప్పుడప్పుడూ పాలతో దానికి అభిషేకాలు కూడా చేసే వారు; అందుకు కావలిసిన పాలు సుబ్బయ్య దగ్గిరే కొనేవాళ్ళు.

ఒక నాగులచవితికి పాపన్న తన భార్యనూ, కొడుకునూ వెంటబెట్టుకుని నాగ నైవేద్యానికి బయలుదేరాడు. మీనాక్షి చలిమిడి ఉండలూ, అప్పాలూ తీసుకున్నది. పాపన్న కొడుకు లోటాలో పాలు తీసు



కున్నాడు. అయితే దారిలో ఆ కుర్రవాడికి ఎదురుదెబ్బ తగిలి పడిపోపటంలో లోటాలో ఉన్న పాలన్నీ నేలపాలయాయి.

దారిలోనే సుబ్బయ్య ఉండే ఇల్లు. పాపన్న అక్కడ ఆగి, సుబ్బయ్య క్షేమ సమాచారాలు విచారించి, "చూడు, సుబ్బయ్యా. నాగాభిషేకానికి ఇంటి నుంచి తెచ్చుకున్న పాలు కాస్తా ఒలికి పోయాయి. కాసిని పాలు ఇయ్యి," అన్నాడు.

"పాలు ఇంటి నుంచి మోసుకురావాలా, పాపన్నగారూ? ఇక్కడ పాలవ్యాపారం చేస్తూ నే నుంటినిగా? నాగాభిషేకానికి అందరూ నా దగ్గిరే పాలు కొనుక్కుపోతారు. మీబోటి వాళ్ళు కొంటేనే గదా నా వ్యాపారం నడిచేది?" అన్నాడు.

సుబ్బయ్య భార్య కాసిని పాలు తెచ్చి లోటాలో పోసింది. అభిషేకం ముగించి ఇంటికి తిరిగి పోయేటప్పుడు మీనాక్షి సుబ్బయ్య భార్యకు ఇన్ని చలిమిడి ఉండలూ, అప్పాలూ ప్రసాదంగా ఇచ్చింది.

ఇది జరిగిన మర్నాడే సుబ్బయ్య ఇంట ఒక ఉపద్రవం జరిగింది. సుబ్బయ్య భార్య రెండాపులనూ పాలు తీసి పెద్ద పాత్రలో పోసేస్తూండగా ఆ పాత్రలో నుంచి బుస్సుమంటూ పాము బయటికి వచ్చి,



ఎటో వెళ్ళిపోయింది. సుబ్బయ్య భార్య హడలిపోయి చావుకేక పెట్టింది. పిల్లలు దడుచుకున్నారు. సుబ్బయ్య దిగాలు పడ్డాడు. ఆ పూట పాలు అపతల పారబోయవలిసి వచ్చింది.

ఆ సాయంకాలం తిరిగి ఇదే విధంగా జరిగింది. పాము వచ్చి ఆ పాలు పోసే పాత్రలో ఎందుకు పడుకుంటున్నదో ఎవరికీ అర్థం కాలేదు. ఈ సంగతి మాత్రం ఊరంతా పాక్కపోయింది.

అందరూ తలా ఒక రకంగానూ అనుకున్నారు. సుబ్బయ్య పాలలో దారుణంగా నీరు కలపటం చేత దేవుడిలా బుద్ధి చెబు



తున్నాడని కొందరన్నారు. ఇంతకాలమూ ఇలా కాకపోవటానికి కారణ మేమిటని మరికొందరు ఆక్షేపించారు.

"నాగాభిషేకానికి అమ్మే పాలు మరీ అన్యాయం. బొత్తిగా నీళ్ళలో పాలు కలుపుతాడు. అందుకే ఇలా అయింది," అని మరికొందరన్నారు.

సుబ్బయ్య భార్యమటుకు తన భర్తతో, "మీరు పాపన్నగారికి పాలు ఇచ్చి డబ్బు పుచ్చుకున్నందున ఇలా జరిగి ఉంటుంది. వెంటనే ఆ డబ్బు ఆయనకు తిరిగి ఇచ్చెయ్యండి," అన్నది.

సుబ్బయ్య అలాగే చేశాడు. కాని మర్నాడు కూడా పాలపాత్రలో పాము కనిపించింది. ఏ పూట కాపూట చేతులారా పితికిన పాలు పారబొయ్యటం జరుగుతున్నది.

ఈ సంగతి పాపన్న దాకా వెళ్ళింది. దీని సంగతేమిటో తెలుసుకోవాలని పాపన్న పెద్ద ఎత్తున నాగోత్సవం జరిపి, నాగపూజ చేయించాడు. పూజ చేసే వాడికి మధ్యలో పూనకం వచ్చింది. ఆ పూనకంలో వాడు, "ఒరే, పాపిష్ఠి సుబ్బయ్యా! నిన్ను నాశనం చేసేస్తాను. నువు లోకులకు నీళ్ళు కలిపిన పాలు అమ్మేది చాలక, నా అభిషేకానికీ అటువంటి పాలే అమ్ముతున్నావు. నీ ఇల్లు నిలబెట్టిన పాపన్నకు—నన్ను స్వయంగా ప్రతిష్ఠ చేసినవాడికి కూడా—అటువంటి పాలే అమ్మావు. నిన్నిక క్షమించను!" అని కేకలు పెట్టాడు.

"బుద్ధి గడ్డి తిని అపచారం చేశాం. క్షమించు, నాగదేవతా! కాపాడు!" అని సుబ్బయ్యా, భార్యా పొర్లుదణ్ణాలు పెట్టారు. తరవాత పూజ చేసేవాడికి పూనకం దిగిపోయింది.

అటు తరవాత సుబ్బయ్యను పాములు బాధించలేదు. అతను కూడా న్యాయంగా పాలవ్యాపారం చేసుకుంటూ ఊరివాళ్ళ గౌరవం సంపాదించుకున్నాడు.





# కృష్ణావతారం

కుంభకుడి మందలో పుట్టిన రాకాసికోడెలను గురించీ, అవి చేసే దురాగతాలను గురించీ, ప్రజలు మొరపెట్టుకోగా, మిథిల రాజు కుంభకుణ్ణి పిలిపించి, "నీ కోడెలు తమను బతకనివ్వటం లేదని పౌరులు ఆక్రోశిస్తున్నారు. నువ్వయినా ఘరానా మనిషివే గాని, సాదా మనిషివి కావు; నీకు బోలెడంత బలగమున్నది. పదిమందినీ సహాయం పిలిచి, ఆ పోట్లగిత్తలను వెంటనే అదుపులో పెట్టెయ్యి, లేదా బీజాలు తీయించు, అలాగూ కాకపోతే అరణ్యంలోకి తరిమెయ్యి," అని గట్టిగా హెచ్చరించి పంపాడు.

కుంభకుడి కేమీ పాలుపోలేదు. ఆ పొగరుబోతు కోడెలను నిగ్రహించటం అతని తరం కాలేదు. అందుకు ప్రయత్నించినప్పుడు చాలామంది గాయపడ్డారు, కొందరు చచ్చారు కూడా. అందుచేత అతను, మరొక ఉపాయ మేదీ తోచక, తన కోడెలను జయించిన వాడికి తన కుమార్తె అయిన నీళ నిచ్చి పెళ్ళి చేస్తానని చాటాడు.

ఈ చాటింపు వింటూనే ఎక్కడెక్కడి నుంచో గోపయువకు లందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. గోవుల మధ్య జీవించే వాళ్ళకు గొడ్లను వంచడం ఎంత పని అని వాళ్ళ ఉద్దేశం. అందుచేత తేలికగా మంచి భార్య దొరుకుతుందని వాళ్ళు ఆశపడ్డారు.

అలా వచ్చిన వాళ్ళు తలా ఒక విధంగానూ ప్రగల్భాలు పలికారు. ఒకడు కోడెలను కొమ్ములు పట్టి వంచేస్తానన్నాడు.

---

6. నీళా కృష్ణుల వివాహం

---



ఇంకొకడు వాటిని పడదోసి పట్టి, ముక్కులు కుట్టుతానన్నాడు. ఇలా బీరాలు పలుకుతూ గోపకులు మల్లలు చరిచారు, అరిచారు, పరుగులు తీశారు, హంగామా చేశారు.

చాటింపు వేసిన సమయంలోనే కుంభకుడు నందగోపుడి వద్దకు మనుషులను పంపాడు. ఆ మనుషులు వచ్చి ఏడెద్దుల సంగతంతా చెప్పగానే నందుడూ, యశోదా, వాళ్ళ వెంట బలరామ కృష్ణులూ, మరి కొందరు గోపకుమారులూ బయలుదేరారు.

కుంభకుడు తన అక్కకూ, బావకూ ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. కుంభకుడి భార్య ధర్మద యశోదకు మర్యాదలు చేసింది. కుంభకుడి కొడుకు శ్రీధాముడు కృష్ణ బలరాములను కౌగలించుకుని, వాళ్ళకు తానే పీటలు తెచ్చి వేశాడు. పాయసాలూ, నేతులూ పుష్కలంగా వడ్డించుకుని అందరూ భోజనాలు చేశారు.

ఆ రాత్రి రాకాసి ఎద్దులు, కృష్ణుడు వచ్చిన సంగతి గ్రహించి, విజృంభించాయి; చూడి ఆవులను కొమ్ములతో పొడిచాయి; ఆ తరవాత కుంభకుడి అంగణంలో చొరబడి, రంకెలు పెడుతూ, గిట్టలతో నేలను తవ్వుతూ అట్టహాసం చేసి, కుండలు పగలగొట్టి, గోడలు గీరి, గరిసెలు కూలదోసి, బళ్ళు విరగదన్ని, పందిళ్ళు పడదోసి, తలుపులు విరగదన్ని నానా భీభత్సమూ చేశాయి. ఆడవాళ్ళూ, పిల్లలూ హాహాకారాలు చేశారు. పై నుంచి వచ్చిన గోపకులు ఎక్కడ వీలుంటే అక్కడ దాక్కున్నారు.

తెల్లవారింది. కుంభకుడు గోపుల నందరినీ పిలిపించాడు. తన కూతురిని అలంకరింప జేసి తెచ్చి వారి ముందు నిలబెట్టి. "గోపకుమారులారా, చూశారు గదా? ఈ పోట్ల గొడ్లు దిగ్గజాలలాటివి, సింహాల లాటివి. వీటిని అదుపులోకి తేవాలని మేము చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయాయి. వీటిని అదుపులో పెట్టకపోతేనేమో రాజు

గారు మమ్మల్ని దండిస్తారు. అందుచేతనే మహాబలులూ, అత్యంత సమర్థులూ అయిన మీ అందరినీ పిలిపించాను. మీలో ఎవరు ఈ పోట్ల గొడ్లను శిక్షించినా, అతనికి ఈ పిల్లనిచ్చి పెళ్ళి చేసేస్తాను," అన్నాడు.

గోపకుమారులంతా ఈ మాటలు విని పెద్ద సందిగ్ధంలో పడ్డారు. నీళను చూస్తే మనసులు ఉవ్విళ్ళూరుతూ ఉత్సాహం పొందుతున్నాయి. రాకాసి ఎడ్లను తలుచుకుంటే గుండెలు నీరై, కాళ్ళు చల్లబడుతున్నాయి. అందుచేత ఎవరూ ఒక నిశ్చయానికి రాలేని స్థితిలో చిక్కుపడ్డారు.

అప్పుడు నందుడి జ్ఞాతి అయిన ఘోషవంతుడనే గోపకుడు, "ఈ బోడి ఎద్దులను చంపలేకపోతే నా బలపరాక్రమా లెందుకు? చూస్తూ ఉండండి, ఒక్క క్షణంలో వీటిని కూల్చిపారేస్తాను," అని మల్లచరిచి, పోట్ల ఎద్దుల మీదికి వెళ్ళాడు. మిగిలిన వాళ్ళు దూర దూరంగా, చెట్ల మీదా, పుట్టల మీదా, గట్ల మీదా నిలబడి ఆశగా చూడసాగారు.

ఘోషవంతుడు ఒక ఎద్దు నెత్తిన పిడికిటితో బలంకొద్దీ కొట్టాడు. చూసే వాళ్ళంతా హర్షధ్వానాలు చేశారు. మరుక్షణమే ఏడు ఎద్దులూ అతన్ని చుట్టు ముట్టాయి. కృష్ణుడు మాత్రం విచారంతో, "ఇతనెందు కిలాటి



పని పెట్టుకున్నాడు? ఎద్దులితన్ని ప్రాణాలతో వదులుతాయా?" అనుకుంటున్నాడు. అంతలోనే ఎద్దులు అతన్ని తమ కొమ్ములతో పొడిచి ఎత్తి, నేల మీద విసిరికొట్టి, తమ కాలిగిట్టలతో దూరంగా తన్నేశాయి.

చూస్తున్న వాళ్ళంతా హాహాకారాలు చేశారు. ఈ విధంగా ఘోషవంతుణ్ణి నేలపాలు చేసిన ఎద్దులు మిగిలిన గోపక సమూహం పైనపడి, కొమ్ములతో పొడుస్తూ, గిట్టలతో మట్టగిస్తూ, నోళ్ళతో కొరుకుతూ, అందరినీ చెదరగొట్టి పారదోలసాగాయి.

అప్పుడు కృష్ణుడు బలరాముడితో, "ఇవి ఎద్దులు కావు. ఎద్దుల కింత కసీ, ఇంత



సాహసమూ ఉండటం అసంభవం. కుంభకుడికి నేనే సహాయం చేస్తాను," అన్నాడు. అని అతను ఆ పోట్లెద్దులను సమీపిస్తూ ఉంటే, నందుడూ, యశోదా కూడా, "వద్దురా, బాబూ!" అని కేకలు పెట్టారు.

కృష్ణుడు మహా కోపంతో పిడికిలి బిగబట్టి వస్తుంటే, అన్నదమ్ములైన ఆ ఏడు రాక్షసి ఎద్దులూ, పాత పగ కొద్దీ కోపావేశం చెంది, ఒక్కసారిగా అతని పైకి దూకుతూ వచ్చాయి. అతను అందిన ఎద్దులను. అరిచేతులతో ముఖాల మీద కొట్టి, కొమ్ములు పట్టుకుని ఒక ఎద్దును మరొక ఎద్దు మీదికి తోసి, కొన్నిటిని తోకలు పట్టి గిరగిరా తిప్పి, కొన్నిటి ముట్టెలూ, వీపులూ వాయగొట్టి, చూసేవారందరికీ మహాశ్చర్యం కలిగేలాగా పోరాడాడు. ఇదంతా అతనికి ఆట-చూసేవాళ్ళ వినోదం కోసం ఆడిన ఆట. చూసేవాళ్ళలో నీళ కూడా ఉన్నది. ఆమె ఎంతో ప్రేమతోనూ, సిగ్గుతోనూ తన కేసి చూస్తుంటే కృష్ణుడికి చాలా ఆనందం కలిగింది.

చిట్టచివర కతను ఈ ఆట కట్టిపెట్టి ఒక్కొక్క పిడికిటి పోటుతో ఒక్కొక్క ఎద్దును తల పగలగొట్టి, ముక్కులా నోటా నెత్తురు కక్కించి, కాలనేమి కొడుకు లేడు గురినీ కడతేర్చేశాడు. నందుడూ యశోదా పరిగెత్తుకుంటూ వచ్చి కృష్ణుణ్ణి కౌగలించుకున్నారు. కుంభకుడు నీళను చెయ్యిపట్టి కృష్ణుడి దగ్గిరికి తీసుకొచ్చి, అతని చేతిలో ఆమె చెయ్యి పెడుతూ, "ఇదుగో నీ పరాక్రమానికి కానుక. నీ మరదలు నీ సొత్తే అయింది. ఏలుకో," అన్నాడు.

ఆయన కృష్ణుడికి వస్త్రాభరణాలూ, యశోదానందగోపులకు బట్టలూ, మిగిలిన గోపకుమారులకు ఇతర కానుకలూ ఇచ్చి, నందుడితో, "బావా, నీ కొడుకు ఉద్దండ ప్రచండ శూరుడు. అతడి దయవల్ల మాకు భయంకరమైన ఆపద తొలగిపోయింది. నా పరువు దక్కింది. ఇక మేము హాయిగా

బతుకుతాం. నీళకు వేలకువేలు గోవులను అరణంగా ఇస్తాను. నా సంతోషం కొద్దీ ఇచ్చే వీటిని నిరాకరించకు," అన్నాడు.

"పిచ్చివాడా, నాకు కట్టుకు పోయినన్ని గోవులు న్నాయి. కృష్ణుడు పుట్టాక మా మందలు తెగ వృద్ధి చెంది, అంతులేని పాలు ఇస్తున్నాయి. ఆ పాల నుంచి ఎత్తుకు ఎత్తు నెయ్యి అవుతున్నది. అందరమూ సుఖంగా ఉంటున్నాం," అన్నాడు నందుడు.

ఆ రోజు మహోత్సవంగా గడిపి నంద యశోదలూ; నీళనూ, తోడుగా శ్రీధాముణ్ణీ వెంట బెట్టుకుని కృష్ణుడూ, మిగిలినవాళ్ళూ తమ బృందావనానికి బయలుదేరి వెళ్ళి పోయి, సుఖంగా జీవించసాగారు. నూత్న యౌవనంలో ప్రవేశించిన కృష్ణుడు పసుపు పచ్చని పట్టు బట్ట కట్టి, నెమలి కన్నులు గల తలపాగా ధరించి, అడవి పువ్వుల మాలలు మెడలో వేసుకుని, వేణుగానంలో ఓలలాడుతూ అంతటా తిరుగుతున్నాడు.

ఒకనాడు బలరామకృష్ణులు పశువులను మేపటానికి యమునా తీరాన గల ఒక మహా వటవృక్షం వద్దకు వెళ్ళి, చుట్టూ గోవులు మేస్తూంటే వాటిని చూస్తూ ఆ మర్రిచెట్టు కింద కూర్చున్నారు. మిగిలిన గోపబాల కులు ఆటలాడు కుంటున్నారు.



ఆ సమయానికి వామదేవుడూ, భరద్వాజుడూ అనే మహామునులు తీర్థయాత్రకై అటుగా వచ్చి, బ్రహ్మాండమైన మర్రి చెట్టును చూడగానే దానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, అక్కడ ఉన్న గోపకులతో, "అబ్బాయిలూ, పాములూ, మొసళ్ళూ లేకుండా స్నానం చెయ్యడానికి అనువైన రేవు, యీ ప్రాంతాల ఎక్కడ ఉన్నది?" అని అడిగారు.

గోపకులు ఒకళ్ళముఖాలు ఒకరు చూసుకుంటూ, "నాకు తెలీదు, వాణ్ణి అడగండి," అని ఒకరినొకరు చూపుకున్నారు. అల్లరి వెధవలు ఆకతాయితనం చేస్తున్నారని



కృష్ణుడు లేచి మునీశ్వరులను సమీపించి, వినయంగా, "మహామునులారా, వీళ్ళకు మంచి రేవేదో ఏం తెలుస్తుంది? మీకు దివ్యమైన రేవు నేను చూపిస్తాను. మీ కాలకృత్యాలూ, అనుష్ఠానాలూ పూర్తి కాగానే తిరిగి ఇక్కడికి రండి. చిక్కాలలో మీగడ పెరుగుతో కలిపిన చద్ది ఉన్నది. చక్కెర కలిపిన పాయసం బోలెడంత తెచ్చాం. మీరు హాయిగా ఆరగించవచ్చు. లేదా, అప్పటికప్పుడు ఉష్ణధారలు పిండి మీకు తాగటానికి ఇస్తాం. నేను నందుడి కొడుకును. నా పేరు కృష్ణుడు. ఇతను మా అన్న బలరాముడు," అన్నాడు.



ఆ మునీశ్వరులు తమతో మాట్లాడిన ఆ కుర్రవాడి తేజస్సు చూసి, గోపకులంలో ఇలాటి వాడు ఎలా కలిగాడా అని ఆశ్చర్యపడి, క్షణం పాటు కళ్ళు మూసుకుని, సమాధిశక్తి ద్వారా నిజం తెలుసుకున్నారు. వాళ్ళు కృష్ణుడితో, "మా అదృష్టం నాయనా! బ్రహ్మదేవుడు మొదలైన వాళ్ళు విశ్వప్రయత్నం చేసినా కనబడని నిన్ను మేము ఇవాళ ఇక్కడ చూడగలిగాం! మా జన్మ సార్థకమయింది. నిన్ను కొడుకునుగా కన్న ఆ తల్లిదండ్రులు అదృష్టవంతులు," అంటూ కృష్ణుణ్ణి పొగడి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

మళ్ళీ కృష్ణుడికి జీవితం మామూలుగా గడిచిపోతున్నది. అతను బలరాముడితో సహా గోపబాలకుల వెంట ఆవుల మందలతో బాటు మేత ప్రదేశాలన్నీ తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ హాయిగా ఉంటున్నాడు.

ఒకనాడతను యమున వెంబడి చాలా దూరం వెళ్ళి అందులో ఒక భయంకరమైన మడుగొకటి చూశాడు. అది చాలా పెద్దది. అందులో సముద్రపు నీరు తెర్లినట్టు నీరు తెర్లుతున్నది. దానిపైన దట్టంగా ఆవిరి కప్పి ఉన్నది. దాని సమీపంలో ఉన్న తీరాల వెంబడి గల చెట్లూ, లతలూ





మాడి ఉన్నాయి. దాని నుంచి బయలు దేరే అలలు భయంకరంగా ఒడ్లను కొట్టు కుంటున్నాయి. ఆ ప్రాంతాల ఒక పిట్టగాని, ప్రాణిగాని బతికేటట్టు లేదు.

ఆ మడుగులో కాళియు డనే మహాసర్పం ఉంటున్నదనీ, దాని నోట అగ్ని జ్వాలలు వెలువడు తూంటాయనీ, ఆ కాళియుడికి గరుత్మంతుడి భయం లేదనీ కృష్ణుడు అది వరకే విని ఉన్నాడు. ఇప్పుడీ మడుగు చూస్తూంటే ఆ మాట నిజమే అయి ఉంటుందనిపించింది. అతను ఆ మడుగు లోకి ప్రవేశించి, ఆ మహాసర్పం మదమణ గించి, మడుగును పశువులు దిగటానికి వీలుగా చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అందువల్ల మరొక మేలు కూడా ఉన్నది. అదేమిటంటే, ఈ కాళియుడి పరివారానికి చెందిన పాములు అసంఖ్యాకంగా వన మంతటా సంచరిస్తూ, బృందావనంలోని కొన్ని ప్రాంతాలను అపాయకరంగా చేస్తు న్నాయి; కాళియుణ్ణి తగిన విధంగా మర్దించి నట్టయితే ఈ చిల్లర సర్పాల ఆటకట్టవు తుంది. ఇది ఎలాగూ చేసి తీరవలసిన పని. అలాటప్పుడు జాప్యందేనికి? వెంటనే చేస్తే సరిపోతుంది.

ఇలా అనుకుని కృష్ణుడు మడుగు ఒడ్డును సమీపించాడు. నీటి అంచున, నిలువునా మాడిపోయిన కదంబవృక్షం ఒకటి ఉన్నది. కృష్ణుడు దానిపైకి ఎక్కి, మడుగులోకి దూక నిశ్చయించాడు. అతను ఎవరితోనూ సంప్రతించలేదు. చంకలో ఉన్న పలుపు తాళ్ళు అవతల పడ వేశాడు. తన ఢక్కా, వేణువూ మరొకరి కిచ్చాడు. నెత్తి మీది పింఛం తీసేసి, జుట్టు ముడివేసుకున్నాడు. బట్ట వెనక్కు విరిచి కట్టాడు. చెప్పులు వదిలేసి కదంబవృక్షం మీది కెక్కి, పాలో మని పెద్ద కేకపెట్టి మడుగులోకి దూకే శాడు. అతను పడ్డ చోట నది నీరు ఇంతెత్తున పైకి చిమ్మింది.





# అరణ్యపురాణం

## 9

కొరుదున్నల మంద శిలాపాతంలాగా కనుమ ఎగువ నుంచి దిగువకు దూకుతూ రాసాగింది. దాని ముందు ఎంతటి పులీ నిలవలేదు. బలహీన మైన దున్నలు పక్కలకు నెట్టివేయ బడ్డాయి. అవి లతలను తెంచుకుంటూ దిగువకు పరిగెత్తాయి.

దున్నల పదఘట్టన షేర్‌ఖాన్‌కు విన బడింది. షేర్‌ఖాన్ లేచి కనుమ దిగువ కేసి ఒళ్ళు ఆడించుకుంటూ పోతూ, తప్పించు కునే మార్గం కోసం చూడసాగాడు. కాని కనుమ పక్కలు చాలా నిటారుగా ఉండటం చేత అతను ముందుకే పోవలసి వచ్చింది. భుక్తాయాసమూ, తాగిన మత్తూ ఇంకా దిగి పోలేదు. తిరగబడి పోట్లాడే ఇచ్ఛ షేర్ ఖాన్‌లో కొంచెం కూడా లేదు. ఒకవేళ పోట్లాడవలిసే వస్తే దూడలతో ఉన్న ఆడ పశువులను ఎదుర్కొనే కన్న దున్నలను ఎదుర్కొవటమే హెచ్చు క్షేమమని షేర్ ఖాన్‌కు తెలియకపోలేదు.

ఇంతలో "రాముడి" కాళ్ళకింద ఏదో మెత్తగా పడి నలిగింది. దాని వెనక వచ్చిన దున్నలలో బలహీనమైనవి కాలు నిలుప లేక, ఒరిగిపోవటం కూడా జరిగింది.

దున్నలన్నీ, ఆడపశువులతో సహా కనుమ దిగువనున్న మైదానం మీదిగి వచ్చేశాయి. మౌగ్లీ "రాముడి" వీపు మీది నుంచి కిందికి జారి, ఎడాపెడా ఉన్న దున్నలను చెదర గొట్టుతూ, "అకేలా, వాటిని వేగం చెదర గొట్టు, లేకపోతే తమలో తాము కుమ్ము లాడుకుంటాయి," అని కేకపెట్టాడు. అతను "హే! హే!" అంటూ పశువులను శాంత పరిచాడు.

షేర్‌ఖాన్‌ను మరి తొక్కించ వలసిన పని లేదు. అతను అప్పుడే ప్రాణాలు వదిలాడు.

అట్ట చివరి బొమ్మ

అతని కళేబరం కోసం అప్పుడే గద్దలు వచ్చేస్తున్నాయి.

తిరిగి కనుమ ఎగువకు ఉరకటానికి సిద్ధంగా ఉన్న పశువుల ఉద్రేకాన్ని అకేలా, అన్నా కలిసి తగ్గించారు. వాళ్ళు పశువుల కాళ్ళను చిన్నగా కొరికారు.

"షేర్‌ఖాన్ కుక్కచావు చచ్చాడు. వాడి తోలు తీసుకుపోయి రచ్చబండ దగ్గిర తగిలిస్తే రంజుగా ఉంటుంది," అంటూ మౌగ్లీ, తన మెడలో ఎప్పుడూ పాదితోబాటు వేళ్ళాడే కత్తిని పైకి తీశాడు.

మనుషుల మధ్య పుట్టిపెరిగిన కుర్రాడెవడూ ఒంటరిగా పులిచర్మం ఒలచగలిగి ఉండడు, కాని జంతువు మీద చర్మం ఎలా అమరి ఉండేదీ మౌగ్లీకి తెలుసు. తోడేళ్ళు రెండూ చర్మాన్ని అతను కోరినప్రకారం పక్కలకు లాగి సహాయం చేస్తూంటే, మౌగ్లీ ఒక గంటసేపు చాలా శ్రమపడి ఆ చర్మాన్ని ఒలుస్తూపోయాడు.

ఇంతలోనే ఎవరిదో చెయ్యి అతని భుజాన పడింది. అతను తల ఎత్తి చూసే సరికి, తుపాకితో సహా బలదేవుడు కనిపించాడు. దున్నల దౌడు గురించి గ్రామంలోని కుర్రాళ్ళు బలదేవుడికి వార్త అందించారు. పశువులను కాయటంలో అశ్రద్ధ చేస్తున్నందుకు మౌగ్లీని మందలింతామని బలదేవుడు



బయలుదేరి వచ్చాడు. మనిషి రాక పసి కట్టగానే తోడేళ్ళు రెండూ అక్కణ్ణించి చల్లగా జారుకున్నాయి.

"నీకేమన్నా మతి ఉందా లేదా? ఒంటరిగా పులి చర్మాన్ని ఒలుద్దామనే? దున్నలు దీన్ని ఎక్కడ చంపాయి? ఇదా కుంటి పులేనే! దాన్ని చంపిన వాళ్ళకి నూరు రూపాయలు బహుమానం ఇస్తారు కూడానూ. దీని తోలు తీసుకుపోయి ఠాన్హె వారాలో చూపి, బహుమానం తెచ్చినప్పుడు అందులో నీకొక రూపాయి ఇస్తాలే. పశువులను దౌడు తీయనిచ్చినందుకు ఈసారికి నిన్ను క్షమిస్తాం," అన్నాడు బలదేవుడు.

మౌగ్లీ పులిచర్మం కొయ్యటం కానిస్తూనే తనలో తాను గొణుక్కున్నాడు. "అలాగా? నువు చర్మం పట్టుకుపోయి నూరు రూపాయలు పుచ్చుకుని అందులో ఒకటి నాకిస్తావూ? నాకు ఈ చర్మంతో వేరేపని ఉన్నదే మరి!" అనుకున్నాడు.

పులి చావగానే దాని ఆత్మ తనను వేధించకుండా దాని మీసాలు కాల్చటం షికారీలకు అలవాటు. బలదేవుడు పులిమీసాలు కాల్చబోతే మౌగ్లీ కసిరాడు.

బలదేవుడు కోపంగా, "ఒరే, ఎవరినో తెలుసా? గ్రామానికి పెద్ద వేటగాణ్ణి. అదృష్టం కలిసొచ్చి, దున్నలు పులిని



తొక్కేశాయి. నేను నీకు బహుమానంలో అణా కూడా ఇవ్వను సరేగదా, మెత్తగా తన్నిస్తాను. ముందా పులిని వదిలిపెట్టి ఇవతలికిరా!" అని గద్దించాడు.

"ఈ పందు కోతితో నాకేమిటి? అకేలా, ఈ మనిషి, చూడు, నన్ను చీకాకుపెడుతున్నాడు," అని మౌగ్లీ కేకపెట్టాడు. అతను చర్మం ఒలవటం ఇంకా కాలేదు.

మరుక్షణమే బలదేవుడు నేల మీద బోర్లాపడి ఉన్నాడు. ఒక తోడేలు అతని మీద నిలబడి ఉన్నది. మౌగ్లీ పళ్ళు బిగబట్టి, "నువ్వన్నది నిజమే, బలదేవ్. నీ నుంచి నాకు ఒక అణా కూడా రాదు. ఈ పులికీ నాకూ మధ్య పాత పగ—చాలా పాత పగ—ఉన్నది. చివరికి నేను నెగ్గాను," అన్నాడు.

పదేళ్ళ క్రితం బలదేవుడు అకేలాకు అలా లొంగి ఉండకపోను. అదీగాక, పులి మీద పగబట్టిన మనిషికి సహాయపడే తోడేలు నెలా ప్రతిఘటించాలో అతనికి అంతుబట్టలేదు. అతని కిదంతా కనుకట్టులాగున్నది.

"మహారాజా, నేను వయసు మళ్ళిన వాణ్ణి. మిమ్మల్ని మామూలు గొడ్లకాపరి కింద జమకట్టటం పొరపాటే. నేను లేచి వెళ్ళిపోతాను. మీ నౌకరు నన్ను చీల్చి చెండాడదుగద?" అన్నాడు బలదేవుడు.

"వెళ్ళు. మరోసారి నా వేటలో జోక్యం కలిగించుకోకు. అతన్ని వెళ్ళిపోనీ, అకేలా!" అన్నాడు మౌగ్లీ.

బలదేవుడు లేచి సాధ్యమైనంత శీఘ్రంగా గ్రామానికి వెళ్ళిపోయాడు. మౌగ్లీ బ్రహ్మరాక్షసిగా మారిపోతాడేమో నన్నట్టుగా అతను తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళాడు. అతను గ్రామంలోకి వెళ్ళి చెప్పిన భూతప్రేత ఇంద్రజాల కథ విని పూజారి నిశ్చేష్టుడైపోయాడు.

పులి చర్మం ఒలవటం పూర్తి అయేసరికి చీకటి పడుతున్నది. —(ఇంకావుంది)



# 63. నయాగరా—అమెరికను జలపాతం

నయాగరా ("జలగర్జన") జలపాతం అమెరికా, కెనడా సరిహద్దు మీద ఉన్నది. ఇవి రెండు జలపాతాలు. కెనడాలో ఉండేదాన్ని హార్స్‌షూ (గుర్రపులాడం) జలపాతం అంటారు. ఈ చిత్రంలో ఉన్నది అమెరికన్ జలపాతం. ఈ జలపాతం నిడివి 1000 అడుగులు, ఎత్తు 167 అడుగులు.



Photo by K. P. A. Swamy



బహుమతి
పొందిన వ్యాఖ్య

వయస్సే వినోదం

పంపినవారు :
కె. సాంబశివుడు, హైదరాబాదు

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

వినోదమే జీవనం

పంపినవారు:
కె. సాంబశివుడు, హైదరాబాదు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలించబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వయస్సే వినోదం

రెండవ ఫోటో : వినోదమే జీవనం

పంపినవారు : కె. బి. ఆర్. సాంబశివుడు,

రామచంద్రపురం, హైద్రాబాదు — 32

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్నచోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిపి నెలలు తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు




బెణుకునొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
బెణికినచోటేకదా!

అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2818

## లాభదాయకం అధునాతనం అయిన చిన్న తరహా కుటీర పరిశ్రమ కొద్ది పెట్టుబడితో ప్రారంభించండి.

కొద్ది పెట్టుబడితో పూర్తికాలికంగా కాని, సహాయపరిశ్రమగా కాని లఘుపరిశ్రమ ప్రారంభించ దలచుకున్నవారు 'అధునాతన కుటీర పరిశ్రమలు' అన్న తెలుగు గ్రంథం (రెండవ ముద్రణ) చదవాలి. లాభదాయమైన చిన్న తరహా పరిశ్రమల గూర్చి, ముడి పదార్థాలు దొరుకుచోట్లు, యంత్రాలను వాయిదాల పద్ధతిని తెప్పించుకోవడం, లఘు పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం వగైరా యెన్నో విషయాలు దీన్లో వున్నాయి. 960 పుటలు; 350 బొమ్మలు; గుడ్డ బైండ్ ప్రతి ధర రూ. 15-50; తపాల ఖర్చు రూ. 1-85, ఇతర ప్రతులు : ఇంగ్లీష్, మరాఠీ, రూ. 15-50; హిందీ రూ. 14-50; గుజరాతీ, మళయాళం, తమిళం, కన్నడం రూ. 13-00.

COTTAGE INDUSTRY
(C. N-9) P. B. 1262,
BEHIND RECRUITING OFFICE,
NEAR RED FORT,
JAMUNA ROAD, DELHI-6.
Telephone : 262835



## జీవన్‌టోన్

రిజిస్టర్డు నంబరు 218726

శరీరంలోని కండరాలనూ రక్తకణాలనూ ఆయుర్వేద ఔషధాలు వృద్ధిచేయలేవా?—లేవు అని కొందరనుకుంటారు. ఇది నిరాధారమైన దురభిప్రాయం. దీన్ని తొలగించేదే జీవన్‌టోన్.

జీవన్‌టోన్ : అద్భుతమైన టానిక్కు. శక్తివంతమైన ధాతువులను, కండరాలను, రక్తకణాలను అతిత్వరితంగా వృద్ధిచేయుటవల్ల కొద్ది వారాల్లోనే మీ బరువు పెరుగుతుంది. బలిష్టంగా ఉన్నవారి శరీరసౌష్ఠవాన్ని ఇంకా పెంపొందిస్తుంది.



జీవన్‌టోన్ సేవనవల్ల బరువు తగుమాత్రం వృద్ధికాగానే పుచ్చుకోవటం మానివేయవద్దు. ఇది శరీరంలో కండరాలతోపాటు కొవ్వుకూడా వృద్ధిచేస్తుంది కనుక, స్థూలకాయులు దీనిని సేవించకూడదు. ఎందుచేతనంటే—విపరీతమైన కొవ్వుతో శరీరం వికారంగా తయారవుతుంది. జీవన్‌టోన్ సేవిస్తున్నంత కాలమూ శరీర వ్యాయామం అత్యంత అవసరం. దీనివల్ల చక్కని ఆకృతి ఏర్పడుతుంది.

జీవన్‌టోన్ బాలింతలకు కల్పతరువువంటిది. ప్రసవించిన తరువాత పూర్వపు శక్తిని పుంజుకోవటంలో ఇది ఎంతగానో తోడ్పడుతుంది. దీనికి పథ్యం లేదు.



450 గ్రాం. వెల రు. 10-00 [తపాలా ఖర్చులు రు. 3/- అదనం]

జ్యోతి హాస్పిటల్

(బా. నం. 1413) 32, వి. ఎన్. రోడ్డు, మద్రాసు - 17

డాక్టర్ దామోదరన్, M.A.I.A.D.S (Regd)

నాకు
ఒకటి
ఇవ్వూ!

కృష్ణా




మిఠాయిలు




కె.సి.పి. లిమిటెడ్,
ఉయ్యూరు & మద్రాసు

Criterion-KCP-947 Te

# కుటుంబము <u>అంతటికి</u> ఫోస్‌ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్‌ఫోమిన్ పండు రుచిగల ఆకుపచ్చ విటమిన్ టానిక్. దీనిలో విటమిన్ బి కాంప్లెక్స్ మరియు అనేక గ్లయిసరో ఫాస్ఫేట్లు గలవు. వాటివలన మీ కుటుంబము దారుఢ్యముగా, సరదాగా, ఆరోగ్యముగా నుండును. ఇంట్లో ఫోస్‌ఫోమిన్ ఉంచండి. దానితో అలసట, ఆయాసము ఇక ఎంత మాత్రమూ వుండవు. ఫోస్‌ఫోమిన్ శక్తి నిచ్చును. ఆకలిని అధికము చేయును. సహన శక్తిని పెంపొందించును. మరియు శరీరము యొక్క రోగ నిరోధక శక్తిని ఎక్కువ చేయును. కుటుంబములో అంతా ఆరోగ్యముగా వుండడానికి రహస్యం ఫోస్‌ఫోమిన్.




SQUIBB® TTT®

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్. ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు వినియోగ: దీని రిజిస్టర్డు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్.

SARABHAI CHEMICALS

Shilpi SC281ATel.

# AWARDS!

# WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST

भारत सरकार
सूचना और प्रसारण मंत्रालय
छपाई और सजावट पर राजपु
ष्ठता प्रमाणप




PRASAD PROCESS PRIVATE LTD
CHANDAMAMA BUILDINGS MADRAS-26

